# మహావాక్య తాత్పర్య సహితము

వేమూరి సుందరమ్మ



గ్రంథకర్త:
గౌడు జోగమాంబ

ఓం

సత్యమువజయతి శ్రీగురుభ్యోనమః ధర్మమేవజయతి

# సన్మానపత్రపము

ఎలమంచిలి, శ్రీరాధాకృష్ణాశాస్త్రిమాధ్యక్షులు, జ్ఞానస్వరూపు లగు గాడు జోగమాంబగారికి కాకినాడపౌరునొసంగిన సన్మాన సామర్థ్యపత్త్రము.

1. అమ్మా, సాధ్వీమణీ!—సీతా, సావిత్రి, అనసూయ మున్నగు పతివ్రతలవలెను, దైవమునే నమ్మి యాతని యందే భారముంచి జీవయాత్రగడపిన పోతనవలెను, శృతులు, స్మృతులు, పురాణేతిహాసములు లోనగు వానిలో విశిష్టములగువానిని అందర కవగాహనమగు నటుల తేటతెలుగున బోధింపగ మీకు.

2. తల్లీ తపస్వినీ!—ఆత్మ పంచాంగాది వేదాంత గ్రంథ ములను, భక్తుల కుపయుక్తమగునటుల బయలుపఱ చుచు, ధన్యులగుటం జేసిన తామెల్లవారికి సంస్మరణీయ ములు. తమజీవితమంతయు సుచరిత్రమయ్యె సుచరిత్ర —పతివ్రత, అట్టిమీకు.

3. మాతా, వరదర్శినీ!—ఉపాధ్యాయినియను పేర్వడసి, ఆంధ్రమండలమంతయు పేరెన్నికగన్న మీకు భక్తిలో మునింగిన మేము, నేడు మీకే సభయందు వేదాంతకళా ప్రబోధినియను సామర్థ్యచిహ్నమును మీకొసగుచున్నా రము దీనిని దయతో స్వీకరింప ప్రార్థితులు.

4. వేదాంత కళాప్రబోధినీ!—వేద వేదాంగాది షట్శాస్త్ర ముల భాగ్యమును దక్కించుగోగల యో జోగమాంబ గారు! మీకు జోహారులు! మిమ్ము స్మరింప నేరని

తెలుగు బిడ్డలును, మీ గొప్ప విద్వత్తును గొండాడి యెఱుంగని తెలుగువాణియు! తెలుగుసీమకు వన్నె తేజాల వనుట పొగడ్త కానేరదు.

5. యశస్వినీ, యోగినీ, వేదాంతకళాప్రబోధినీ!- వేమేల ఆచార్య (వేద వాఖ్యానముచేసెడి స్త్రీ) ఆచార్యాణి, ఆచార్యాని (తనంతట నే మంత్రవ్యాఖ్యానము చేసెడిస్త్రీ) అను నామధేయములు గూడ మీయెడ సార్థకములు మీసుగుణసంపద అగ్రస్థాన మలంకరించినది.

కావున మీరు శ్రీ పార్వతీ పరమేశ్వరుల కటాక్షము వలన వేదములకును, బ్రాహ్మణములకును, అరణ్యములకును ఉపనిషత్తులకును, సూత్రగ్రంథములనువ్రాసి, ప్రకటింతురు గాక. మీరు పూర్ణాయుర్దాయవంతు లయ్యెదరుగాక !!

మంగళంమహాత్ శ్రీ శ్రీ శ్రీ.

ఇట్లు కాకినాడ పురజనులతరఫున

| | |
|---|---|
| కాకినాడ | వైదికధర్మవిశారద |
| సత్యనారాయణమూర్తి | పశుమర్తి విశ్వపతిశాస్త్రి. |
| (జమీందారు) మేనేజింగు | పులవర్తిభీమలింగమూర్తి, |
| ధర్మకర్త, సర్పవరం దేవస్థానం. | అడ్వకేటు. కాఖ్యారి రామ |
| పులవర్తి శీతారామమూర్తి | చంద్రసత్యనారాయణరావు |
| వ్రాలు, సీతారామస్వామివారి | శ్రీభీమేశ్వరస్వామివారి దేవ |
| దేవస్థానం, మేనేజింగుధర్మకర్త | స్థానం, మేనేజింగుధర్మకర్త |
| | శ్రీగంధిలక్ష్మీనారాయణవ్రాలు. |

# స్థూల పంచీకరణ చక్రము

గురర్బ్రహ్మ గురర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః। గురుస్సాక్షాత్ పరంబ్రహ్మస్మై శ్రీగురవేనమః॥

బ్ర
హ్మ వి
ష్ణు మ హే
శ్వ రా

| | సాత్విక ఆ | సాత్వి వాయు | సాత్వి అగ్ని | సాత్వి జలం | సాత్వి పృథ్వి |
|---|---|---|---|---|---|
| | రాజ। ఆ | రాజ। వా | రాజ। అ | రాజ - జల | రా। పృథ్వి |
| తామస ఆకాశం | ఆకాశం కూటస్థుడు | మనస్సు చంద్రుడు | బుద్ధి బృహస్పతి | చిత్తము క్షేత్రజ్ఞుడు | హంకారం రుద్రుడు |
| తామస వాయువు | సమానం విశ్వుడు | వ్యానము విశ్వ కర్త వాయువు | వుదానము విశ్వయోని | ప్రాణము జయుడు | అపానం అజయుడు |
| తామస అగ్ని | స్రోత్రము దిక్కులు | త్వక్కు వాయువు | చెక్షువు సూర్యుడు అగ్ని | జింహః వరుణుడు | గ్రాణము అశ్వినిదేవత |
| తామస జలము | శబ్దము | స్పర్శ | రూపము | రసము జలము | గంధము |
| తామస పృథ్వి | వాక్కు అగ్నిహో॥ | పాణి ఇంద్రుడు | పాదము వుపేంద్రుడు | వుపస్థ ప్రజాపతి | పాయువు మృత్యువు పృథ్వి |

ఓం
శ్రీ
శ్రీ

ఓం

సత్యంవద      శ్రీ గురుభ్యోనమః      ధర్మంచర

# ఉపోద్ఘాతము

శ్లో॥ నిత్యానందం పరమసుకదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతంగగనసదృశం తత్వమశ్యాదిలక్ష్యం।
ఏకంనిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుతన్నమామి॥

ఓ సోదర సోదరీమణులారా! లోకములో ప్రస్థుత కాలము చాలమంది ముముక్షుజనులుగనే కానుపించుచున్నందునను వారికి మోక్షాపేక్ష కలిగియున్ననూ మాతృభాషయగు సంస్కృతవిద్య లోపించుటమాత్రమే గాక, తెనుగు భాషకూడా అభ్యాసము తక్కువయగువారు కొందరును, అథవా వ్రాత చాతకానివా రనేకులును, అందు కొందరకు చదువుటకూడా బాగా చేతకానివారును, కొందరు కొంచెము చదువుట, కొంచెము వ్రాయుట అలవడియున్నను, అవసరమగు ముఖ్య విషయములను గ్రహింప నేర్పు చాలనందునను, శాస్త్రములు బాహుళ్యమగుటవలనను, ముముక్షుజనులకు ఉపయోగములగు ధర్మములు వేరుగా నేర్పాటుగాయున్నచో, సులభముగా గ్రహించుకొని తరింపగలరను భావముతో

మహావాక్యార్థమును యీ పంచీకరణమును వ్రాసి అచ్చొత్తించడమైనది.

ఇందు బ్రహ్మసూత్రవాక్యములు, పైంగలోపనిషద్వాక్యములు, శ్రీ సుక రహస్యోపనిష ద్వాక్యములు, మాండూక్యోపనిషద్వాక్యములు, యింకనూ గీతాబాష్యము ఉపనిషద్భాష్యము, సూత్రబాష్యాదిసారమంతయు తేటతెల్లముగా ఒకచోట చేర్పబడుటవలన యేమాత్ర మోక్షాపేక్షగలవారికైనా అందుబాటులో వున్నది.

అదియునుగాక అనేకజిల్లాలలో మన ఉపన్యాసములు చెప్పుచున్నందున ఆయాప్రాంతములలోగల అనేకమంది భక్తజనులు మన ఉపన్యాససందర్భములలో మహావాక్యములలో ఇంతఅర్థమున్నదని యిదివరకు మేము ఎరుగము. లోకములో చాలమంది గురువుల మనిపించువారుకూడా యేవో రహశ్యబోధలని వారివద్ద వుపదేశముపొందినవారికేగాని ఇతరులకు చెప్పకూడదని చెప్పుట యేగాక, ఒకస్తోత్రముగాని, పంచీకరణముగాని, మాకు చెప్పుచున్నారు. వారిశిష్యులకు గూడా ఏమి తెలిపినట్లు కనపడదు, గురువులకు తెలిసినగదా శిష్యబృందము గ్రహించుట. గాన మాకు పంచీకరణము మహావాక్యములు వ్రాసి ఇవ్వవలయును. మీరు పరోపకార

బుద్ధితో అన్నిధర్మములు అనర్గళముగా చెప్పుచున్నందున యిట్లు ప్రార్థించుచున్నాము, అని చాలమంది కోరినందున, కొందరికి వ్రాసి ఇచ్చిననూ అందరకు వ్రాయుట కష్టమనియు, వానవాలు గుణితము రానివారు పుస్తకముపట్టజాలనట్లు సాంఖ్యసూత్రజ్ఞానము (పంచీకరణము) తెలియజాలనివారికి శరీరమర్మము, సాక్షిజ్ఞానము తెలియుటకష్టమని అచ్చు వేయించిన అందరూ బాగుపడుదురని తలంచడమైనది.

ఓం తత్సత్

ఇట్లు

చెరాచర సుభాభిలాషి

గౌడు జోగమాంబ.

—

ఓం

శ్రీ గురుభ్యోనమః

శ్లో॥ ఓం బ్రహ్మణోరవ్యక్తః అవ్యక్తాన్ మహత్ ః। మహతో హంకారహ హంకారాతే పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యో పంచమహాభూతాం పంచమహాభూతేభ్యో అఖిలం జగత్ ॥

వ॥ తశ్శబ్దవాచ్యమైన సుద్ధసత్వప్రధానమైన మాయాశభళితం బ్రహ్మ ఆబ్రహ్మ నాశ్రయించినదే ప్రకృతి. ఆప్రకృతి సృష్టివుపాదివశములచేత మూడు గుణములాయెను, సత్వరజస్తమోగుణము లాయెను. సత్వగుణము మాయ అనిన్నీ, రజోగుణము అవిద్య అనిన్నీ, తమోగుణము ఆవరణవిక్షేపద్వాయ శక్తులనిన్నీ చెప్పబడెను. మాయయందు ప్రతిఫలించినవాడు ఈశ్వరుడు. అవిద్యయందు ప్రతిఫలించినవాడు జీవుడు. మాయా మాయాదిష్టానము మాయాప్రతిఫలితచైతన్యము మూడూ కూడి ఈశ్వరుం డాయెను. అవిద్యా, అవిద్యాదిష్టానము, అవిద్యాప్రతిఫలితచైతన్యము మూడూ కూడి జీవుం డాయెను. శుద్ధ సాత్వికమాయాప్రతిబింబచైతన్యము ఈశ్వరుం డగుటచేత సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, సర్వాంతర్యామిత్వాదిగుణములు గలవా డాయెను. మలినసాత్విక అవిద్యాప్రతిబింబచైతన్యము జీవుండగుటచేత కించత్ గిత్వ కించర్ మిళిత కతృత్వభోక్తృత్వాది గుణములు గలవా డాయెను.

మాయా అవిద్యలవల్లనుంచినీన్ని, ప్రతిఫలించిన ఆత్మ వల్లనుంచినీన్ని సత్వరజస్తమోగుణాత్మకమై, ఆవరణవిక్షేప ద్వయాత్మకమై, అనృతజడదుఃఖాత్మకమై తామసమహత్తత్వం కల్పితమాయెను. మహత్తత్వము వల్లనుంచినీన్ని ప్రతిఫలించిన ఆత్మవల్లనుంచినీన్ని సత్వరజస్తమోగుణాత్మకమై ఆవరణ విక్షేప ద్వయాత్మకమై, అనృతజడదుఃఖాత్మకమై, తామసహంకారము, కల్పితమైనది, అహంకారమువల్లనుంచినీన్ని, ప్రతిలించిన ఆత్మవల్లనుంచినీన్ని, సత్వరజస్తమోగుణాత్మకమై, ఆవరణవిక్షేప ద్వయాత్మకమై, అనృతజడదుఃఖాత్మకమై, శబ్దగుణకమైన తామస ఆకాశము కల్పితమాయను ఆకాశమువల్లనుంచినీన్ని, ప్రతిఫలించిన ఆత్మవల్లనుంచినీన్ని, సత్వ రజ స్తమోగుణాత్మకమై, ఆవరణ విక్షేపద్వయాత్మకమై, అనృతజడదుఃఖాత్మకమై, శబ్దస్పర్శ గుణకమైన, తామసవాయువు కల్పితయాయను, వాయువువల్లనుంచినీన్ని, ప్రతిఫలించిన ఆత్మవల్లనుంచినీన్ని, సత్వ రజ స్తమోగుణాత్మకమై, ఆవరణవిక్షేప ద్వయాత్మకమై, అనృతజడదుఃఖాత్మకమై, శబ్ద స్పర్శ రూప గుణకమైన, తామస అగ్నికల్పితయాయను, అగ్నివల్లనుంచినీన్ని, ప్రతిఫలించిన ఆత్మవల్లనుంచినీన్ని, సత్వరజస్తమో గుణాత్మకమైన, ఆవరణవిక్షేప ద్వయాత్మకమై, అనృతజడదుఃఖాత్మకమై. శబ్దస్పర్శరూప రసగుణకమైన, తామసజలము కల్పితమాయను, జలమువల్ల నుంచినీన్ని, ప్రతిఫలించిన ఆత్మవల్లనుంచినీన్ని, సత్వరజస్తమో

గుణాత్మకమై, ఆవరణవిక్షేప ద్వయాత్మకమై, అనృతజడ దుఃఖాత్మకమై, శబ్ద స్పర్శ రూప రసగుణకమైన, తామస జలము కల్పితమాయను జలమువల్లనుంచిన్నీ ప్రతిఫలించిన ఆత్మవల్లనుంచిన్నీ సత్వరజస్తమోగుణాత్మకమై, ఆవరణవిక్షేపద్వయాత్మకమై అనృతజడదుఃఖాత్మకమై శబ్ద, స్పర్శ, రూప, రసగంధగుణకమైన తామసపృథ్వీకల్పితమాయను, పృథ్వీవల్లఓషధులు, ఓషధులవల్ల అన్నము, అన్నమువల్ల జీవులు వృద్ధినొందుచున్నవి. ఇక్కడికి ఈశ్వరసృష్టిఆయెను.

## —•జీవసృష్టి యేలాగంటే•—

ఓంప్రణమ రెండై, అందుసగము అర్ధమాత్రకై. తక్కిన సగము మూడుభాగములై అకార, వుకార, మకారములైనది. అకారం, రజోగుణము, మకారం తమోగుణము, వుకారం సత్వగుణము, అకారం బ్రహ్మ వుకారం విష్ణు, మకారం రుద్రుడు "సత్వంల్లోసత్వం విష్ణువు సత్వంల్లో రజస్సు, బ్రహ్మ, సత్వంల్లో తమస్సు రుద్రుడు, రజస్సులో సత్వం, పుణ్యాత్ములు, రజస్సులోరజస్సు కామక్రోధములు, రజస్సులో తమస్సు పాపిష్టులు, తమస్సులో సత్వం, వకటి రెండై, రెండోది నాలుగై, అందు మొదటిభాగం సమిష్టిని, అంతరేంద్రియములైనవి. రెండోభాగం వెష్టిని, జ్ఞానేంద్రియములైనవి, తమస్సులో రజస్సు ఒకటి రెండై, రెండోది నాలుగై, అందు మొదటిభాగం సమిష్టిని, ప్రాణేంద్రియములైనవి. వెష్టిని ఖర్మేంద్రియములైనవి. తమస్సులో తమస్సు పిపీలికాది బ్రహ్మపర్యంతం గల, తృణాది మేరుపర్యంతము గల జీవ ఈశ్వరలకు స్తూలశరీరములు అయినవి.

తామస ఆకాశము వకటి రెండై, రెండోది నాలుగై అందు మొదటిభాగం సమిష్టి, నిజాంశము, అంతఃకరణ గోళకమందు జేరి జ్ఞాతఅయినది.

తక్కిన నాలుగుభాగములలో అందు మొదటిభాగం వెష్టి తామసవాయువుంగూడి, జ్ఞాతకు మనోగోళకమైనది. రెండోభాగం వెష్టి, తామస అగ్నింగూడి, జ్ఞాతకు బుద్ధిగోళకమైనది. మూడోభాగం వెష్టితామస జలముంగూడి, జ్ఞాతకు చిత్తగోళకమైనది. నాలుగోభాగం వెష్టితామస, పృథ్విగూడి. జ్ఞాతకు అహంకారగోళకమైనది జ్ఞాతామనో బుద్ధి చిత్తహంకారము లైదున్ను, ఆకాశపంచకమనిన్ని, జ్ఞాతకు అంతఃకరణగోళకమనిన్ని చెప్పబడెను.

2 తామసవాయువు యొక్క తమోంశము వకటి రెండై, రెండోది నాలుగై, అందు మొదటిభాగం సమిష్టి నిజాంసం, జ్ఞాతకు వ్యాన, వాయువు, గోళకమైనది తక్కిన నాలుగుభాగములలో, అందు మొదటిభాగం వెష్టి, తామస, ఆకాశముంగూడి, జ్ఞాతకు సమాన వాయుగోళకమైనది. రెండోభాగం, వెష్టితామస, అగ్నింగూడి, జ్ఞాతకు వుదాన వాయుగోళకమైనది మూడోభాగం వెష్టితామస జలముంగూడి జ్ఞాతకు ప్రాణవాయువు గోళకమైనది. నాలుగోభాగం వెష్టితామస, పృథ్వింగూడి జ్ఞాతకు అపానవాయువు గోళకమైనది. సమాన, వ్యాన, వుదాన, ప్రాణ, అపానములు

అయిదున్నూ వాయుపంచకమనిన్ని, జ్ఞాతను, ఘ్రాణేంద్రియ గోళకమనిన్ని చెప్పబడెను.

3. తామస అగ్నియొక్క తమోంసం ఒకటి రెండై, రెండోది నాలుగై, అందు మొదటిభాగం సమిష్టి నిజాంశం జ్ఞాతను చెక్షురింద్రియగోళక మైనది. తక్కిన నాలుగుభాగములలో, అందు మొదటిభాగం వెష్టి తామస, ఆకాశమునుగూడి, జ్ఞాతను శ్రోత్రేంద్రియ గోళకమైనది. రెండోభాగం వెష్టితామస వాయువుంగూడి, జ్ఞాతను త్వగేంద్రియగోళకమైనది. మూడోభాగం వెష్టితామస జలముంగూడి, జ్ఞాతను జిహ్వేంద్రియ గోళకమైనది. నాలుగోభాగం వెష్టి తామస పృధ్వింగూడి, జ్ఞాతను గ్రాణేంద్రియగోళకమైనది. శ్రోత్ర, త్వక్కు, చెక్షు, జింహ్వా, గ్రాణేంద్రియము లైదున్నూ, అగ్నిపంచకమనిన్ని, జ్ఞాతను జ్ఞానేంద్రియగోళక మనిన్ని చెప్పబడెను.

4. తామస, జలంయొక్క తమోంశం, వకటిరెండై రెండవది నాలుగై, అందు మొదటిభాగం సమిష్టినిజాంశం, జ్ఞాతను రసనేంద్రియగోళకమైనది. తక్కిన నాలుగుభాగములలో, అందు మొదటిభాగం వెష్టితామస, ఆకాశముంగూడి జ్ఞాతను శబ్దతన్మాత్ర అయినది. రెండనభాగం వెష్టితామస వాయువుంగూడి, జ్ఞాతను స్పర్శతన్మాత్ర అయినది. మూడవభాగం వెష్టి తామస అగ్నింగూడి. జ్ఞాతను రూపతన్మాత్ర అయినది. నాలుగవభాగం వెష్టి తామస పృద్వినిగూడి,

జ్ఞాతకు గంధతన్మాత్ర అయినది. శబ్ద స్పర్శ రూప రస గంధము లైదున్నూ, జలపంచకమనిన్నీ, జ్ఞాతకు శబ్ధతన్మాత్రలనిన్నీ, పంచవిషయములనిన్నీ చెప్పబడెను.

5. తామస పృధ్వియొక్క తమోంశము ఒకటిరెండై రెండవది నాలుగై, అందు మొదటిభాగం సమిష్టి నిజాంశం జ్ఞాతకు పాయు రేంద్రియ గోళకమైనది తక్కిన నాలుగు భాగములలో అందు మొదటిభాగం వెష్టి తామస ఆకాశముంగూడి, జ్ఞాతకు వాగేంద్రియగోళకమైనది. రెండవభాగం వెష్టి తామస వాయువుంగూడి, జ్ఞాతకు పాణేంద్రియగోళకమైనది. మూడవభాగం వెష్టి తామస అగ్నింగూడి, జ్ఞాతకు పాదేంద్రియగోళకమైనది. నాలుగవభాగం వెష్టి తామస జలముంగూడి జ్ఞాతకు వుపస్తేంద్రియగోళకమైనది వాక్పాణి పాదోపాయూపస్త లైదున్నూ పృధ్వీపంచకమనిన్నీ జ్ఞాతకు కర్మేంద్రియగోళక మనిన్నీ చెప్పబడెను.

## —♦ సాత్వికఅధి దేవతల వివరము ♦—

1. సాత్వికఆకాశం 2. సాత్వికవాయువు 3. సాత్విక అగ్ని 4. సాత్వికజలము 5. సాత్వికపృధ్వి.

1. సాత్వికఆకాశం, వకటి రెండై అందు మొదటి భాగం, సమిష్టినిజాంశం కూటస్తుడనే అధిదేవతై, జ్ఞాతకు అంతఃఖరణగోళకమందు జేరి, సర్వేంద్రియ కతృత్వాము చేయుచున్నది.

2. సాత్త్విక వాయువు, వకటి రెండై అందు మొదటి భాగం సమిష్టి నిజాంశం. చంద్రుడనే అధిదేవతయి, జ్ఞాతను మనోగోళకమందు జేరి, సంకల్పవికల్పములను చేయుచున్నది.

3. సాత్త్విక అగ్ని వకటి రెండై, అందు మొదటి భాగం సమిష్టి నిజాంశం, బృహస్పతి అనే అధిదేవతై, బుద్ధి గోళకమందు జేరి, మనస్సు సంకల్పించిన సంకల్పము నిశ్చయించుచున్నది.

4. సాత్త్వికజలం వకటి రెండై, అందు మొదటిభాగం సమిష్టి నిజాంశం, క్షేత్రజ్ఞుడనే అధిదేవతై, జ్ఞాతను చిత్త గోళకమందు జేరి బుద్ధి నిశ్చయించిన నిశ్చయం చింతనచేయుచున్నది.

5. సాత్త్విక పృధ్వి వకటి రెండై, అందు మొదటి భాగం సమిష్టి నిజాంశం, రుద్రుడనే అధిదేవతై, జ్ఞాతను అహంకారగోళకమందు చేరి అభిమానించుచున్నది.

1. సాత్త్వికఆకాశం రెండోభాగం వెష్టి దిక్కులనే అధిదేవతై, జ్ఞాతను శ్రోత్రేంద్రియ గోళకమందుచేరి దశవిధ నాధంబులు వినుచున్నది.

2. సాత్త్వికవాయువు రెండోభాగం వెష్టి వాయువనే అధిదేవతై, జ్ఞాతను త్వగింద్రియగోళకమందు జేరి, త్రివిధ స్పర్శలను గ్రహించుచున్నది.

3. సాత్విక అగ్ని రెండో భాగం వెష్టి సూర్యుడనే, అధిదేవతై, జ్ఞాతకు చెక్షురీంద్రియగోళకమందు చేరి, దశవిధరూపములు చూచుచున్నది.

4. సాత్విక జలం, రెండో భాగం వెష్టి వరుణుడనే అధిదేవతై, జ్ఞాతకు జిహ్వేంద్రియగోళకమందు జేరి, షడ్రుచులను గ్రిహించుచున్నది.

5. సాత్విక పృధ్వి రెండో భాగం వెష్టి, అశ్వినీదేవతలనే అధిదేవతలై, జ్ఞాతకు గ్రాణేంద్రియ గోళకమందు జేరి, త్రివిధగంధములను వాసనచూచుచున్నది.

—♦ రాజసఅధిదేవతల వివరము ♦—

1. రాజస ఆకాశం 2. రాజస వాయువు 3. రాజస అగ్ని 4. రాజస జలము 5. రాజస పృధ్వి.

1. రాజస ఆకాశం వకటి రెండై, అందు మొదటి భాగం సమిష్టి నిజాంశం, విసిష్టుడనే అధిదేవతై, జ్ఞాతకు సమానవాయుగోళకమందు జేరి చతుర్విధ ఆహారములను పచనము చేసి, డెబ్బదిరెండు వేలనాళ్ళకు పంచి యిచ్చుచున్నది

2. రాజస వాయువు వకటి రెండై, అందు మొదటి భాగం సమిష్టి నిజాంశం, విశ్వకర్త అనే అధిదేవతై, జ్ఞాతకు వ్యానవాయు గోళకమందు జేరి, సర్వేంద్రియములందు వ్యాపకించుచున్నది

3. రాజస అగ్ని వకటిరెండై, అందు మొదటిభాగం సమిష్టి, నిజాంశం విశ్వయోని అనే అధిదేవతై, జ్ఞాతకు

వుదానవాయుగోళకమందు జేరి, వైఖరీపలుకులు పలికించుచున్నది.

4. రాజస, జలం వకటిరెండై అందు మొదటిభాగం సమిష్టి, నిజాంశం జయుడనే అధిదేవతై, జ్ఞాతకు ప్రాణేంద్రియగోళకమందు జేరి, వూర్ధ్వగమనం చేయుచున్నది.

5. రాజస, పృధ్వి వకటిరెండై అందుమొదటిభాగం సమిష్టి నిజాంశం, అజయుడనే అధిదేవతై, జ్ఞాతకు అపానవాయువు గోళకమందు జేరి, అధోగమనం చేయుచున్నది.

1. రాజస, ఆకాశం రెండవభాగం వెష్టి అగ్నిహోత్రుడనే అధిదేవతై, జ్ఞాతకు వాగింద్రియగోళకమందు జేరి వచించుచున్నది.

2. రాజస, వాయువు రెండవభాగం వెష్టి, ఇంద్రుడనే అధిదేవతై, జ్ఞాతకు ప్రాదేంద్రియ గోళకమందు చేరి, ఇచ్చిపుచ్చుకొనుచున్నది.

3 రాజస, అగ్ని రెండవభాగం వెష్టి వుపేంద్రుడనే అధిదేవతై, జ్ఞాతకు ప్రాణేంద్రియ గోళకమందు చేరి, గమనాగమనములు చేయుచున్నది.

4. రాజస, జలం రెండవభాగం వెష్టి, ప్రజాపతి అనే అధిదేవతై, జ్ఞాతకు వుపస్తేంద్రియ గోళకమందు చేరి, ఆనందించుచున్నది,

5. రాజస, పృథ్వి రెండవభాగం వెష్టి మృత్యువనే అధిదేవతై, జ్ఞాతకు పాయురింద్రియ గోళకమందుజేరి జీవోపాధిసంబంధమైన, మలవిసర్జన చేయుచున్నది.

శ్లో॥ జ్ఞాతాసమానవాయుశ్చ శ్రోత్రంశబ్దస్తదైవచ
వాగపంచ మిదంప్రోక్తం ఇత్యేతే వ్యోమపంచకమ్॥

,, మనశ్చో వ్యానవాయుశ్చ త్వక్స్పర్శ స్త దైవచ
పాణిపంచమిదంప్రోక్తం ఇత్యేతేవాయుపంచకమ్॥

,, బుద్ధించో దానవాయుశ్చ చక్షు రూపః స్తదై వచ
పాదపంచమిదంప్రోక్తం ఇత్యేతే అగ్నిపంచకమ్॥

,, చిత్తంచో ప్రాణవాశ్చ జింహ్వారసన మేవచ
గుహ్యాపంచమిదంప్రోక్తం ఇత్యేతే జలపంచకమ్।

,, అహంచో అపానవాయుశ్చ గ్రాణంగంధః స్తదై వచ
పాయుపంచమిదంప్రోక్తం ఇత్యేతే పృథ్విపంచకమ్॥

వ॥ ఈ జ్ఞాతే సమానవాయువుతో సంబంధించి, స్త్రోత్రేంద్రియంద్వారా, శబ్దమును గుర్తెరింగి. వాగింద్రియముద్వారా వచించుచున్నది.

2. ఈ జ్ఞాతే మనోరూపకమై, వ్యానవాయువుతో సంబంధించి త్వగింద్రియంద్వారా, స్పర్శను గుర్తెరింగి, పాణీంద్రియంద్వారా ఇచ్చిపుచ్చుకొనుచున్నది.

3. ఈజ్ఞాతే బుద్ధిరూపకమై, వుదానవాయువుతో సంబంధించి, చక్షురీంద్రియంద్వారా రూపమును గుర్తెరింగి, పాదేంద్రియంద్వారా గమనాగమనములు చేయుచున్నది.

4. ఈజ్ఞాతే చిత్తరూపకమై, ప్రాణవాయువుతో సంబంధించి, జిహ్వేంద్రియంద్వారా రసమును గుర్తెరింగి, వుపస్తేంద్రియంద్వారా ఆనందించుచున్నది.

5. ఈజ్ఞాతే అహంకార, రూపకమై, అపానవాయువుతో సంబంధించి, ఘ్రాణేంద్రియంద్వారా గంధమును గుర్తెరింగి పాయురీంద్రియంద్వారా జీవోపాధిసంబంధమైన మల విసర్జన చేయుచున్నది.

## —♦ భూతముల వివరము ♦—

1. ఆకాశభూతం ఆకాశతత్వంతో కలసి జ్ఞాత అయినది.
   ఆకాశభూతం వాయుతత్వంతో కలసి మనస్సుఅయినది
   ఆకాశభూతం అగ్నితత్వంతో కలసి బుద్ధిఅయినది
   ఆకాశభూతం జలతత్వంతో కలసి చిత్తమైనది
   ఆకాశభూతం పృధ్వీతత్వంతో కలసి అహంకారమైనది
2. వాయుభూతం ఆకాశతత్వంతో కలసి సమానమైనది
   వాయుభూతం వాయుతత్వంతో కలసి వ్యానమైనది
   వాయుభూతం అగ్నితత్వంతో కలసి వుదానమైనది
   వాయుభూతం జలతత్వంతో కలసి ప్రాణమైనది
   వాయుభూతం పృధ్వీతత్వంతో కలసి అపానమైనది

3. అగ్నిభూతం ఆకాశతత్వంతో కలసి శ్రోత్రమైనది
అగ్నిభూతం వాయుతత్వంతో కలసి త్వక్కు అయినది
అగ్నిభూతం అగ్నితత్వంతో కలసి చక్షువు అయినది
అగ్నిభూతం జలతత్వంతో కలసి జింహ్వా అయినది
అగ్నిభూతం పృథ్వీతత్వంతో కలసి ఘ్రాణమైనది
4. జలభూతం ఆకాశతత్వంతో కలసి శబ్దమైనది
జలభూతం వాయుతత్వంతో కలసి స్పర్శ అయినది
జలభూతం అగ్నితత్వంతో కలసి రూపమైనది
జలభూతం జలతత్వంతో కలసి రసమైనది
జలభూతం పృథ్వీతత్వంతో కలసి గంధమైనది
5. పృథ్వీభూతం ఆకాశతత్వంతో కలసి వాక్కైనది
పృథ్వీభూతం వాయుతత్వంతో కలసి పాణైనది
పృథ్వీభూతం అగ్నితత్వంతో కలసి పాదమైనది
పృథ్వీభూతం జలతత్వంతో కలసి వుపస్తైనది
పృథ్వీభూతం పృథ్వీతత్వంతో కలసి వాయువైనది.

—♦ అధ్యాత్మ ఆధిభౌతికం అధిదైవికముల వివరం ♦—

1. అంతఃకరణ అధ్యాత్మ సర్వేంద్రియకర్తృత్వం ఆధిభౌతికం ఈశ్వరుడు, అధిదైవతం.

మనస్సు– అధ్యాత్మ, సంకల్పం ఆధిభౌతికం, చంద్రుడు ఆధిదైవతం.

బుద్ధి–అధ్యాత్మ. నిశ్చయం ఆధిభౌతికం, బృహస్పతి, అధిదైవతం.

చిత్తం-అద్యాత్మ చింతనం, అధిభౌతికం, క్షేత్రజ్ఞు డధిదైవకం.

అహంకారం-అద్యాత్మ అహంకతృత్వం అధిభౌతికం రుద్రు డధిదైవికం.

2. సమానం-అద్యాత్మ, పచనం అధిభౌతికం విశిష్టు డధిదైవకం.

వ్యానం-అద్యాత్మ, వ్యావకం అధిభౌతికం విశ్వకర్త అధిదైవికం.

వుదానం-అద్యాత్మ, వైఖరీ అధిభౌతికం విశ్వయోని అధిదైవికం.

ప్రాణమద్యాత్మ-ఊర్ధ్వగమనం అధిభౌతికం జయు డధిదైవికం.

అపానం-అద్యాత్మ, అధోగమనం అధిభౌతికం అజయుడధిదైవికం.

3. శ్రోత్రం-అద్యాత్మ, శబ్దం భౌతికం వాక్కధిదైవికం.
త్వక్కు-అద్యాత్మ సర్శఅధిభౌతికం వాయువు అదిదైవికం
చెక్షు-అద్యాత్మ, రూపం అధిభౌతికం సూర్యుడధిదైవికం
జిహ్వా-అద్యాత్మ, రసం అధిభౌతికం వరుణు డగిదైవికం
గ్రాణం-అద్యాత్మ, గందం అధిభౌతికం అశ్వినీదేవత లధిదైవికం.

4. వాక్కు-అద్యాత్మ, వచనం అధిభౌతికం అగ్నిహోత్రు డధిదైవికం.

ప్రాణి- అధ్యాత్మ, దానం అధిభౌతికం ఇంద్రుడధి దైవికం.

పాదం-అధ్యాత్మ, గమనం అధిభౌతికం, వుపేంద్రు డధిదైవికం.

వుపస్థ-అధ్యాత్మ, ఆనందం అధిభౌతికం, పజాపతి అధిదైవికం.

పాయువు-అధ్యాత్మ, విసర్జన అదిభౌతికం, మృత్యు వధిదైవికం.

—♦ స్థానముల వివరము ♦—

1. జ్ఞాతకు జ్ఞేయ విషయం, కూటస్తు డధిదైవకం, స్థానం భ్రూమధ్యస్థానం, తత్వం ఆకాశతత్వం, ఇది నాత్మ విషయం కనుక నీవను, ఆత్మ కానేరదు.

2 మనస్సుకి సంకల్పం విషయం, చంద్రుడధిదైవకం స్థానం కంఠస్థానం, తత్వం వాయుతత్వం. ఇది నాత్మ విషయం కనుక నీవను, ఆత్మ కానేరదు.

3. బుద్ధికి నిశ్చయం విషయం బృహస్పతి అధిదైవకం స్థానం నేత్రస్థానం, తత్వం అగ్నితత్వం, ఇది నాత్మవిషయం కనుక నీవను, ఆత్మ కానేరదు.

4. చిత్తానికి చింతనం విషయం, క్షేత్రజ్ఞ డధిదైవకం స్థానం, హృదయస్థానం తత్వం జలతత్వం, ఇదాత్మవిషయం కనుక నీవను, ఆత్మ కానేరదు.

5. అహంకారానికి అభిమానం, విషయం రుద్రుడధి దైవికం. స్తానం నాభిస్తానం, తత్వం పృధ్వీతత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను, ఆత్మకా నేరదు.

1. సమానానికి పచనం విషయం. విశిష్టుడధిదైవకం స్తానం నాభిస్తానం, తత్వం ఆకాశతత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను, ఆత్మకా నేరదు.

2. వ్యానానికి వ్యాపకం విషయం. విశ్వకర్త అధిదైవకం. స్తానం వ్యాపకస్తానం, తత్వం వాయుతత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను, ఆత్మకా నేరదు.

3. వుదానానికి వైఖరీ విషయం, విశ్వయోని అదిదైవికం. స్తానం కంఠస్తానం. తత్వం అగ్నితత్వం. ఇది నాత్మ విషయం కనుక నీవను, ఆత్మకా నేరదు.

4. ప్రాణానికి వూర్ధ్వగమనం. విషయం-జయుడదిదైవికం, స్తానం హృదయస్తానం, తత్వం జలతత్వం. ఇది నాత్మ విషయం కనుక నీవను, ఆత్మకా నేరదు.

5. అపానానికి అధోగమనం. విషయం-అజయుడదిదైవికం. స్తానం గుహ్యాస్తానం, తత్వం పృధ్వీతత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను, ఆత్మకా నేరదు.

1. స్రోత్రానికి శబ్దం విషయం, దిక్కులు అధిదైవకం. తత్వం ఆకాశతత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను ఆత్మకా నేరదు.

2. త్వక్కుకి స్పర్శ విషయం, వాయువు అధిదైవకం తత్వం వాయుతత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను ఆత్మ కానేరదు.

3 చెక్షువుకి రూపం విషయం, సూర్యుడధిదైవకం. తత్వం అగ్నితత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను ఆత్మ కానేరదు.

4. జింహ్వాకి రసం విషయం, వరుణు డధిదైవకం. తత్వం జలతత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను ఆత్మ కానేరదు.

5. ఘ్రాణానికి గంధం విషయం, అశ్వినీదేవత లధిదైవతలు, తత్వం పృధ్వీతత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను ఆత్మ కానేరదు.

1. వాక్కుకి వచనం విషయం, అగ్నిహోతృడు అధిదైవకం తత్వం ఆకాశతత్వం. ఇదానాత్మవిషయం కనుక నీవను ఆత్మకానేరదు.

2. పాణికి దానం విషయం. ఇంద్రు డదిదైవకం. తత్వం వాయుతత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను ఆత్మ కానేరదు.

3. పాదానికి గమనం విషయం, వుపేంద్రుడు అధిదైవకం తత్వం అగ్నితత్వం. ఇది నాత్మవిషయం కనుక నీవను ఆత్మకానేరదు.

4. వుపస్థకి ఆనందం విషయం, ప్రజాపతి అధిదైవతం తత్వం జలతత్వం, ఇది నాత్మవిషయం కనుక నీవను, ఆత్మ కానేరదు.

5. పాయువుకి విసర్జన విషయం, మృత్యువదిదైవతం తత్వం పృథ్వీతత్వం. ఇది నాత్మ విషయం కనుక, నీవను ఆత్మకా నేరదు.

శ్లో॥ పంచీకృతమహాభూతం సంభవం ఖర్మసంచితం
శరీరం సుఖదుఃఖానాం భోగాయతనుముత్యతే॥

,, పంచప్రాణమనోబుద్ధి దశేంద్రియసమన్వితం
అపంచీకృతభూతార్థం సూష్మాంగంభోగసాధనం॥

,, అనాద్యవిద్యాఅనిర్వాచ్యం కారణోవుపాది వుచ్యతే
వుపాదిత్రితయో ధన్యో ఆత్మానంభహుధారయేత్॥

—♦ శరీరముల వివరము ♦—

త్వక్ చెర్మమాంసరుథిర మేధోమజ్జాస్తి, అను సప్త ధాతు యుక్తంబైనది. జాగ్ర స్వప్న సుప్తియు, తధ అభిమాన దేవతలు. ఈ ఆత్మకు స్థూలశరీర మనియు, సూష్మశరీర మనియు, కారణశరీరమనియు, మహాకారణ శరీరమనియు, నాలుగు శరీరములు కలవు.

1. అందు మొదటిదగు స్థూలశరీర మేదియనగా-అంతరింద్రియములున్ను, ప్రాణేంద్రియములున్ను జ్ఞానేంద్రియములును, పంచెతన్మాత్రలున్నూ, ఖర్మేంద్రియములున్నూ,

జ్ఞాతయున్నూ గూడి పంచెవింశతీ తత్వకంబై, విశ్వుండును, నామంబున వెష్టిసమిష్టిత మోంశంబులంగూడి, జాగ్రదవస్త యందు వర్తించుచుండెను. ఇదియే స్థూలశరీర మనబడును.

2. రెండవదియగు సూక్ష్మశరీర మేదియనగా-ప్రాణేంద్రియములున్నూ, జ్ఞానేంద్రియంబులున్నూ, ఖర్మేంద్రియంబులున్నూ, మనోబుద్ధులు రెండున్నూ, కలసి యీ పది హే డున్నూ వెష్టి సమిష్టి తమోంశంబుంగూడి, తైజసుండను నామంబున స్వప్నావస్తయందు వర్తించుచుండును. ఇదియే సూక్ష్మశరీర మనబడును.

3. మూడవదియగు కారణశరీర మేదియనగా మాయా అవిజ్జలున్నూ, ఆవరణవిక్షేప శక్తులున్నూ, మూలాప్రకృతులున్నూ, కలసి ప్రాజ్ఞుండను నామంబున, వెష్టిసమిష్టి తమోంశంబులం గూడి, సుషుప్త్యవస్తయందు వర్తించు చుండును.

4. నాలుగవదియగు మహాకారణ మేదియనగా-జ్యోతిస్వరూపుండునూ, స్వయంప్రకాసుండును, చరాచర జంగమంబంతయు నిండి, సూత్రధారియై శుద్ధచైతన్యంబై, సర్వసాక్షియై, యుండిన చైతన్యంబే మహాకారణంబనియును విరాట్టుస్వరూపుం డసియూ, హిరణ్యాగర్భుండను నామంబున యేయవస్తయు నెరుంగక, తురీయాతీతంబున ఆనందంబు అనుభవించుచుండును. ఇదియే మహాకారణ మనబడును.

## —♦ అష్టాంగంబుల వివరము ♦—

శ్లో॥ అష్టాంగంచ చతుష్పాదం త్రిస్థానం పంచదైవతం
ఓమిత్యేవనజానాతి బ్రాహ్మణో నభవేత్సహి॥

వ॥ అను శృతిననుసరించి, అష్టాంగంబులనగా-జీవ తనువులు నాలుగు, ఈశ్వరతనువులు నాలుగు, చతుష్పాద మనగా-విద్యా, అవిద్య, ఆనందము, తురీయము. త్రిస్థాన మనగా-జీవ ఈశ్వరజగత్తులు. పంచదైవంబులనగా-బ్రహ్మ, విష్ణు రుద్రఈశ్వర సదాసివులు. శృతి ఎట్లువచ్చెననగా-ఆకాశము వాయువు అగ్ని జలము పృథ్వి లైదున్ను, రవిచంద్రాగ్నులు మూడున్ను, కలసి ఈ యెనిమిదియున్ను, ఈశ్వరుని అష్టప్రకృతు లనబడును. ఆధారస్వాదిష్ట మణిపూరక అనాహత విశుద్ధ చక్రములున్ను, అవ్యక్త మహదహంకార ములున్ను; యీ యెనిమిదిన్ని జీవుని అష్టప్రకృతులనబడును. ఇదియే జగస్సృష్టి యని చెప్పబడెను. అందు సప్తవ్యసనంబులున్ను, సప్తద్వీపంబులున్ను సప్తసముద్రంబులున్ను దశవాయువులని దశనాళ్ళని దశవిధనాథంబులని మహూర్తులని అరిషడ్వర్గంబులని పంచఅగ్నులని నాలుగు యుగంబులని, యేడేడు పద్నాలుగు భువనంబులని, అండపింఢ బ్రహ్మాండంబులని, షట్చక్రంబులని వాటియందు ఇడాపింగళాసుషుమ్న లని సూర్యచంద్రనాడులని హంసయొక్క అజపాగాయత్రీ, సత్వరజస్తమోగుణము త్రిమూర్తులు పంచవర్ణములు అకార ఉకార మకారములు యేబది ఆరక్షరంబుల గూడినవని చెప్పి

56

జగము కలదనుట అసత్యమని చెప్పి బ్రహ్మసత్యం జగన్మిథ్య అను వాక్యము ననుసరించి.

—♦ ఇంద్రియములలయ వివరం ♦—

1. ఆకాశంబొక్క బయలాంశమున్ను, పృద్వియొక్క కఠినాంశమున్ను కలసి వాక్కైనది కనుక, ఆకాశంయొక్క బయలాంశం ఆకాశమునకిచ్చి, తావచ్చి పృద్విలోకలసిన వాక్కు లయమ్.

2. వాయువు యొక్క చెలనాంశమున్ను, పృద్వి యొక్క కఠినాంశమున్ను కలసి, పాణైనదికనుక వాయువు యొక్క చెలనాంశమ్ము వాయువుకిచ్చి, తావచ్చి పృద్విలో కలసిన పాణి లయమ్.

3. అగ్నియొక్క తేజాంశమున్ను, పృద్వియొక్క కఠి నాంశమున్ను కలసి పాదమైనదికనుక, అగ్నియొక్క తేజాం శమున్ను అగ్నికిచ్చి తావచ్చి పృద్విలోకలసినపాదం లయమ్

4. అప్పుయొక్క ద్రవాంశమున్ను, పృద్వియొక్క కఠినాంశమున్ను కలసి వుపస్థైనది కనుక, అప్పుయొక్క ద్రవాంశము అప్పుకిచ్చి, తావచ్చి పృద్విలోకలసిన వుపస్థ లయమ్.

1. ఆకాశము యొక్క బయలాంశమున్ను, అప్పు యొక్క ద్రవాంశమున్ను కలసి శబ్దమైనది కనుక, ఆకాశం బయలాంశము, ఆకాశానికిచ్చి తావచ్చి, అప్పులోకలసిన శబ్దం లయమ్.

**2.** వాయువుయొక్క చెలనాంశమున్ను అప్పుయొక్క ద్రవాంశమున్ను కలసి స్పర్శైనదికనుక, వాయువు చెలనాంశము వాయుకిచ్చి తావచ్చి అప్పులోకలసిన స్పర్శ లయమ్.

3. అగ్నియొక్క తేజాంశమున్ను, అప్పుయొక్క ద్రవాంశమున్ను కలసి రూపమైనది కనుక, అగ్నియొక్క తేజాంశం అగ్నికిచ్చి, తావచ్చి అప్పులో కలసిన రూపం లయం.

4. అప్పుయొక్క ద్రవాంశమున్ను, పృద్వియొక్క కఠినాంశమున్ను కలసి గంధమైనది కనుక పృద్వి కఠినాంశము పృద్వికిచ్చి తావచ్చి అప్పులోకలసిన గంధం లయమ్.

1. ఆకాశంయొక్క బయలాంశమున్న అగ్నియొక్క తేజాంశమున్ను కలసి, శ్రోత్రమైనది కనుక, ఆకాశం బయలాంశము ఆకాశానికిచ్చి తావచ్చి అగ్నిలోకలసిన శ్రోత్రం లయమ్.

2. వాయువుయొక్క చెలనాంశమున్ను, అగ్నియొక్క తేజాంశమున్ను కలసి, త్వక్కైనది కనుక వాయు చలనాంశం వాయుకిచ్చి, తావచ్చి అగ్నిలోకలసిన త్వక్కు లయమ్.

3. అగ్నియొక్క తేజాంశమున్ను, అప్పుయొక్క ద్రవాంశమున్ను కలసి, జిహ్వైనది కనుక, అప్పుద్రవాంశము అప్పుకిచ్చి, తావచ్చి అగ్నిలోకలసిన జిహ్వ లయము.

4. పృథ్వియొక్క కఠినాంశమున్ను, అగ్నియొక్క తేజాంశమున్ను కలసి, గ్రాణమైనదికనుక పృథ్వియొక్క

కఠినాంశం పృధ్వికిచ్చి, తావచ్చి అగ్నిలోకలసిన గ్రాణం లయమ్.

1. ఆకాశముయొక్క బయలాంశమున్ను, వాయుయొక్క చెలనాంశమున్ను కలసి, సమానమైనది. కనుక ఆకాశముయొక్క బయలాంశము, ఆకాశానికిచ్చి తావచ్చి వాయువులోకలసిన సమానం లయము.

2. వాయుయొక్క చెలనాంశమున్ను, అగ్నియొక్క తేజాంశమున్న కలసి వుదానమైనది కనుక, అగ్నియొక్క తేజాంశము అగ్నికిచ్చి, తావచ్చి వాయులోకలసిన వుదానము లయము.

3. వాయువుయొక్క చెలనాంశమున్న అప్పుయొక్క ద్రవాంశమున్న కలసి ప్రాణమైనది కనుక, అప్పుయొక్క ద్రవాంశము అప్పుకిచ్చి తావచ్చి వాయువులో కలసిన ప్రాణము లయము.

4. వాయువు యొక్క చెలనాంశమున్ను, పృద్వియొక్క కఠినాంశమున్న కలసి, అపానమైనది కనుక పృద్వియొక్క కఠినాంశము, పృద్వికిచ్చి, తావచ్చి వాయువులో కలసిన, అపానము లయము.

1. ఆకాశముయొక్క బయలాంశమున్న, వాయువుయొక్క చెలనాంశమున్న కలసి మనస్సైనదికనుక, వాయుయొక్క చెలనాంశము వాయుకిచ్చి, తావచ్చి ఆకాశములో కలసిన మనస్సు లయము.

2. ఆకాశముయొక్క బయలాంశమున్ను, అగ్ని యొక్క తేజాంశమున్ను కలసి బుద్ధైనదికనుక అగ్నియొక్క తేజాంశము, అగ్నికిచ్చి తావచ్చి ఆకాశములో కలసిన బుద్ధి లయము.

3. ఆకాశము యొక్క బయలాంశమున్ను, అప్పు యొక్క ద్రవాంశమున్ను కలసి, చిత్తమైనది కనుక. అప్పు ద్రవాంశము అప్పుకిచ్చి, తావచ్చి ఆకాశములో కలసిన చిత్తం లయము.

4 ఆకాశముయొక్క బయలాంశమున్ను, పృద్వి యొక్క కఠినాంశమున్ను కలసి అహంకారమైనది కనుక, పృద్వి కఠినాంశము పృద్వికిచ్చి తావచ్చి ఆకాశంలోకలసిన అహంకారం లయము.

1. అన్నమునందు కలిగినజీవులు, అన్నముకన్న వ్యతి రేకము కాదుకనుక అన్నమునందున నే లయమ్

2 ఓషధులవల్ల కలిగిన అన్నము ఓషధులకన్న వ్యతి రేకము కాదుకనుక ఓషధులవందే లయమ్

3. పృద్వియందు కలిగిన ఓషధులు పృధ్వికన్న వ్యతి రేకము కాదుకనుక పృధ్వియందేలయము

4. జలమునందుకలిగిన పృధ్వి, జలముకన్న వ్యతిరే కముకాదుకనుక జలమునందే లయము

5. అగ్నియందుకలిగిన జలము అగ్నికన్న వ్యతిరేక ముకాదు కనుక అగ్నియందే లయము

6. వాయువునందున కలిగిన అగ్ని వాయువుకన్న వ్యతిరేకము కాదుకనుక వాయువునందే లయము

7. ఆకాశమునందు కలిగినవాయువు ఆకాశముకన్న వ్యతిరేకము కాదుకనుక ఆకాశమునందే లయము

8. అహంకారమువలన కలిగిన ఆకాశము అహంకారమునందే లయము

9. మహః తత్వమందుకలిగిన అహంకారము మహః తత్వంకన్న వ్యతిరేకము కాదుకనుక మహఃతత్వమునందే లయం

మూలాప్రకృతివల్ల కలిగిన మహఃతత్వం, మూలాప్రకృతికన్నా వ్యతిరేకముకాదుకనుక మూలాప్రకృతియందే లయము. సత్వ రజ స్తమోగుణమున్ను మూలాప్రకృతియందేలయమ్. ఆవరణవిక్షాపద్వయశక్తులున్ను, మూలాప్రకృతియందే లయమ్ అకార ఉకార మకారములున్ను మూలాప్రకృతియందే లయమ్. బ్రహ్మ విష్ణు, రుద్రులున్నూ మూలాప్రకృతియందేలయమ్. పరబ్రహ్మమునందు కలిగిన మూలాప్రకృతి పరబ్రహ్మముకన్న వ్యతిరేకము కాదుకనుక పరబ్రహ్మమునందే లయమ్. అఖిలాండకోటి బ్రహ్మాండంబులున్ను పరబ్రహ్మమునందే లీనమైనవి.

శాంతిః శాంతిః శాంతిః

ఓం తత్సత్.

## —: తొంబై ఆరు తత్వములు :—

5. పంచభూతముల వివరము

ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి.

5. పంచజ్ఞానేంద్రియముల వివరము

శ్రోత్రము, త్వక్కు, చక్షు, జింహ్వా, ఘ్రాణేంద్రియము

5. పంచవిషయములు వివరము

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు

5. పంచకర్మేంద్రియముల వివరము

వాక్కు, పాణి, పాదము, వుపస్త, పాయువు

5. కర్మేంద్రియములకు విషయములు

వచన, దాన, గమన, విసర్గ, ఆనందములు

5. పంచప్రాణముల వివరములు

ప్రాణము, అపానము, వ్యానము, వుదానము మూనం

5. పంచ వుపవాయువులు వివరము

నాగ, కూర్మ, కుకుర దేవదత్త, ధనంజయములు

5. పంచకోశముల వివరము

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయలు

4. అంతఃఖరణ చతుష్టయములు

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము

4. అంతరింద్రియముల వివరము

సంకల్పము, నిశ్చయము, చింతనము, అభిమానము

8. అష్టమదముల వివరము

కులమదము, బలమదము, యవ్వనమదము, రాజ్య మదము, శీలమదము, తపోమదము, రూపమదము, ధన మదము

6. షడూర్మ్మలు వివరములు

ఆకలి, దప్పిగ, శోకము, మోహము, జననము, మరణము

6. షడాచక్రముల వివరములు

ఆధార, స్వాధిష్టాన, మణిపూరక, అనాహత. విశుద్ధ ఆజ్ఞేయములు

7. సప్తధాతువులు వివరములు

రుధిరము, మాంసము, హాస్తి, మజ్జ, శుక్ల, శోణి తము, మేధస్సు

10. దశనాళ్ళు

ఇడా, పింగళ, సుషుమ్న, గాంధారి, హాస్తి, జింహ అలంపుసా, కృకుర, శంఖినీ అశ్వనీ

3. గుణత్రయములు

సత్వగుణము రజోగుణము తమోగుణము

3. తాపత్రయములు

అధ్యాత్మ ఆదిభౌతిక అదిదైవికము

౩. ఈషణత్రయములు

ధారేషణ ధనేషణ పుత్రేషణములు

౩. మండలత్రయములు

సూర్యమండలము చంద్రమండలము అగ్నిమండలములు

౩. అవస్థాత్రయములు: జాగ్రత స్వప్నము సుషుప్తి.

—◆ ఆర్తత్రాణపరాయణశ్లోకరత్నషట్కం ◆—

వాత్సల్యాదభయప్రదానసమయా । దార్తార్తినిర్వాపణా।
దౌదార్యా రఘుశోషణాదగణిత శ్రేయః పదప్రాపణాత్।
సేవ్యశ్శ్రీపతి రేకఏవజగతా। మేతేచషట్సాక్షిణః।
ప్రహ్లాదశ్చ విభీషణశ్చకరిరాట్। పాంచాల్యహల్యాధ్రువః

1. ప్రహ్లాదాఽస్తియదీశ్వరోవదహరి స్సర్వత్ర మేదర్శయ స్తంభేచైన। మితి బ్రువంతమధునా। తత్రావిరాసీద్ధరిః। వక్షస్తస్యవిదారయన్ నిజజనేవాత్సల్యమానేదయన। ఆర్తత్రాణపరాయణస్స భగవాన్నారాయణో మేగతిః ॥

2. శ్రీరామోత్రవిభీషణో ఽయమనఘోరభయాదాగతః।
సుగ్రీవా ఽనయపాలయైన మధునాపౌలస్త్య మేవాగతం।
ఇత్యుక్త్వాభయమస్య సర్వవిదుషాం యోరాఘవోదత్తవాన్॥ ఆర్తత్రా॥

3. నక్రగ్రస్తపదం సముద్ధృతకరం బ్రహ్మాది దేవాసురాః మాం పాతు త్వితిదీనవాక్యకరణైః దేవేష్వశక్తేషుచ। మాభైషీతిరరక్షనక్రవదనా చ్చక్రాయుధశ్రీధరః॥ఆర్తత్రా॥

4. హాకృష్ణాఽచ్యుత హాకృపాజలనిధే హాపాండవానాంసఖే। క్వాఽసిక్వాఽసిసు యోధనా దపహృతాం హారక్షమామాతురాం। ఇత్యుక్తా ఽక్షయవస్త్ర సంవృతతనుం యోఽపాలయద్ద్రౌపదీం॥ఆర్తత్రా॥

5. యత్పాదాబ్జ నఖోదకంత్రిజగతా। పాపౌఘవిధ్వంసనం యన్నామామృతపూరకం చపిబతాం సంసారసంతారకం। పాషాణోపియదం ఘ్రిపద్మరజసా శాపాన్మునేర్మోచితః॥ ఆర్తత్రా॥

6. పిత్రాభ్రాతరముత్తమాసనగతం భక్తోత్తమశ్చధ్రువః। కృత్వాతత్సమమారురుక్షురుదితో మాత్రావమానంగతః యన్నత్వాశరణంతతాపతపసా హేమాద్రిసింహాసనే॥ ఆర్తత్రా॥

శ్రీరామచంద్రాయనమః

—♦ సప్తర్షికృత శ్రీరామస్తవరాజము ♦—

శ్లో॥ స్వస్వమానసకాతర్యమాలోక్య స్వస్యమానసమ్। శిక్షయన్తస్తతోరామం తుష్టువుస్తే పృథక్పృథక్॥ 1

—: కశ్యపోవాచ :—

శ్లో॥ నిత్యంకిధావసిచలవిషయా ననుభవితుం సుఖలేశాభాసానురుతరదుఃఖానతిదుస్స్వాదూ నత్యన్తాయాసా న్ంహోమూలా నుగ్రభయంకర రౌరవాదినారకగతిహేతూనేతానపిపరిహార సీతాపతిమాశుపరిచరేశమ్। భోచేతః శ్రీరామంభజశరణమ్। శ్రీరఘురామం భజశరణమ్॥

శ్రితచిన్తామణి మతికరుణాకర మరిహారమురుతర శర
కోదండమ్॥
2

—: అత్రిపోవాచ :—

శ్లో॥ బహువిధపాపవశాదిహ। నానాయోనిషుజన్మమృతీ।యా
తో దేహీదైవాదుత్తమ మానుషపౌరుష విప్రదేహవి
ద్యాసంపన్నోఽపి బ్రహ్మణిపరమేవిముఖో దుఃఖీ దుర్విష
యైషీనశ్యతి తృణకబళస్వీకరణే కాలేపశురివరో మన్దం
కర్యన్ భో చేతః శ్రీరామంభజశరణం॥
3

—: భరద్వాజోవాచ :—

శ్లో॥ ఉపర్యుపరిమనోరథజాలం విద్యానపికామయతే యతతే
యతతే పుత్రమిత్రకళత్రాదిషునిర్వేదం నైతికామకామీ
విద్యాసంపత్కులధనయౌవనసౌభాగ్యగర్వ పర్వతాధి
రూఢోమూఢః పశ్చాదం దేతమసి పతత్యవశోంధుమంద
ఇవకుర్వన్ భోచేతః శ్రీరామం॥
4

—: విశ్వామిత్రో వాచ :—

శ్లో॥ అరిషడ్వర్గంజహితృష్ణామపి మాయావిలసితి మిదమితి
బుద్ధ్వా దుర్జనసంగతి మతిదూరీకు సజ్జనమాశ్రయభో
పరధన పరదారాభిరతిం త్యజపారలౌకికధర్మం పరిచిను
పద్మాపతి పదపద్మసేవ యబన్ధముక్త యే భోచేతః శ్రీ॥ 5

—: గౌతమో వాచ :—

శ్లో॥ కర్ణాకర్ణయనై దేహీ వరవర్ణనీయ గుణవందితచరితం।
నయనాలోకయనళిననయనం ముఖసున్దరేన్దుబిమ్బం!
మస్తకసంస్తుత మహిమానంనమ కస్తూరీ నికరాహారిమ

ర్చయ హస్త యుగానసీ పాలక మినకులరత్నమ్
భోచేతః శ్రీ॥ 6

—ః జమదగ్నిరో వాచ :—

శ్లో॥ పరాపవాదం పరిహరజిహ్వే పారుష్యంచ నృతమపిమా
వద సంకీర్తయ। కేశవ నారాయణ వామనగోవింద
నృహరే శ్రీకృష్ణ వైకుంఠాధిప లక్ష్మీనాయకభుధజన
మానసమందిరపాలయేతి సతతమ్ భోచేతః శ్రీ॥ 7

—: వసిష్ఠ వాచ :—

శ్లో॥ నిత్యానందం సత్యమనంతం బ్రహ్మపరాత్పర మవ్యయ
మమలమ్। నిత్యంశుద్ధం బుద్ధంశాంతం శాశ్వత మప్రమే
యమామద్యమ్। సర్వాసాముపనిషదామర్ధ శ్రీరామ
స్సీతాపతిరితిహరిహర చతురాననాదిభిర్గీయతే। యస్త
స్యదాసోహం భోచేతః శ్రీరామంభజశరణమ్॥ 8

శ్లో॥ ఏవంస్తుత్వా రామచంద్రం మునీంద్రాః
ప్రత్యేకంతే భక్తినమ్రాస్తనానీమ్।
ఆపన్నార్తిధ్వాంతభానుం ప్రపన్నా
స్తూష్ణీమాసన్ రామపాదైకనిష్ఠాః ॥ 9

ఇతి శ్రీ తత్త్వసంగ్రహరామాయణే
ఉమామహేశ్వర సంవాదే అయోధ్యాకాణ్డే
చోర సమాగమే సప్తర్షికృత
శ్రీరామస్తవ రాజోనామ
చతుర్వింశోధ్యాయః
సమాప్తః

ఓం.

సత్యమేవజయతి ॥ శ్రీ గురుభ్యోనమః ॥ ధర్మమేవజయతి

# మహావాక్యార్థ తాత్పర్యసహితము

శ్లో॥ మన్నాథశ్రీజగన్నాథో మద్గురు శ్రీజగద్గురుః।
మమాత్మాసర్వభూతాత్మా తస్మై శ్రీగురవేనమః॥

## —♦ మహావాక్యరత్నావళి ♦—

మహాశయులారా! మోక్షమార్గమునకు ముఖ్యముగా సాంఖ్య, యోగ, వేదాంతాది మోక్షోపాయములుగా పరిగణింపబడుచున్నవి కావున యిందు వ్రాయబడిన హంశములను, పఠించి కంఠస్థము చేసినచో, ముక్తి కరతలామలకమగును.

1. ఓంప్రజ్ఞానంబ్రహ్మ—ఇది ఋగ్వేదాంతర్గత ఐతరేయోపనిషత్సంబంధ లక్షణ మహావాక్యము.
2. ఓంఅహం బ్రహ్మాస్మి—ఇది యజుర్వేదాన్తర్గత బృహదారణ్యకోపనిష త్సంబంధ సాక్షాత్కార మహావాక్యము.
3. ఓంతత్వమసి—ఇది సామవేదాంతర్గత చాందోగ్యోపనిషత్సంబంధ వుపదేశ మహావాక్యము.
4. ఓంఅయమాత్మా బ్రహ్మ—ఇది అథర్వణవేదాన్తర్గత, మాండూక్యోపనిష త్సంబంధ అనుభవమహావాక్యము.

ఈవిధముగా నాల్గు మహావాక్యములు, వేదములో గల ముఖ్యసారమంతయు, మోక్షమునకు విభాగింపబడినది.

అదెట్లన- వేదములను చెరుకు కొరకలేనివారికి, ఉపనిషత్తు లను ఖండములు యేర్పడినవి. అట్టి కణుపులుకూడా నమల జాలనివారికి, శ్రీభగవద్గీత యను, చెరకురసము తీసి పోయు చున్నారు. అటువంటి పానకముకూడా త్రాగలేనివారికి, ముందుచెప్పిన మహావాక్యము లను పంచదార చక్కీలు తయారుచేసియున్నారు. గాన మీరు భక్తిశ్రద్ధలతో పఠించి కంఠస్థముచేసుకొని నిత్యము మననము చేసినచో ముక్తి కర తలామలక మగును.

1. ఓం ప్రజ్ఞానం బ్రహ్మ- యను వాక్యముయొక్క అర్థనిర్ణయము చేయబడుచున్నది, జీవుడు ప్రజ్ఞద్వారా వాక్కు పైకెక్కి నేను ఇచ్చెదను, పుచ్చుకొందును యని చెప్పు చున్నాడు. అట్లుగనే జీవుడు ప్రజ్ఞద్వారా చిత్తముపైకెక్కి గ్రహించితిని. గ్రహించెదను చెప్పుచున్నాడు. ఇచ్చెదను. పుచ్చుకొందును. అనునపుడు వాగారోహణమనియు గ్రహిం చితిని; గ్రహించెదను అనునపుడు చిత్తారోహణమనియు చెప్పబడును. అనగా ప్రజ్ఞానమను సోపానముద్వారా జీవుడు చిత్తమను ప్రాసాదము నధిష్టించుచున్నాడు. వాక్కుపై కెక్కినచో వాక్శుద్ధియు స్ఫుటజ్ఞానమును; చిత్తముపైకెక్కి నచో అనుభవసాక్షాత్కారజ్ఞానము సిద్ధించుచున్నది.

మాండూక్యోపనిషత్తునందు ప్రజ్ఞయొక్క స్వరూప మునుగురించి అనేకవిధములుగాయున్నట్లు చెప్పబడినది. అందు అంతర్ప్రజ్ఞ; బాహ్యప్రజ్ఞ; బాహ్యాంతరప్రజ్ఞ; శుద్ధప్రజ్ఞ;

మందప్రజ్ఞ; మలినప్రజ్ఞ; తీవ్రప్రజ్ఞ ఈమొదలగు అనేకరూప
ములుగా చెప్పబడిననూ వృత్తి భేదముచేత అట్లు కానుపించి
ననూ ప్రజ్ఞయనునది వకటిగనే యుండును. అదెట్లనగా
చంద్రగహణకాలమందే రాహువుయొక్క వునికి తెలియు
నట్లు ప్రజ్ఞ నాశ్రయించినపుడే విజ్ఞానమయుని యునికి తెలియ
బడును. మరియు సర్వప్రపంచకమునకు ప్రకాశమైన తన
స్వరూప మెరుంగుటవలన ఈయాత్మను ప్రజ్ఞయని చెప్పుదురు.

శ్లో॥ ఏనేక్ష తేశృణోతీదం జిఘ్రతీవ్యాకరోతిచ ।
స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞానముదీరితమ్ ॥ 1

తా॥ యను బ్రహ్మసూత్రవాక్యానుసారముగా బుద్ధి
వృత్తి శబ్ద శక్తి నాశ్రయించి సర్వము చూడగల్గుచున్నది.
వినగల్గుచున్నది. యేఆత్మసాన్నిధ్యమాత్రమున అంతఃకరణ
వృత్తి స్త్రోత్రేంద్రియముగుండా సర్వశబ్దములను వినగల్గు
చున్నదో నేత్రేంద్రియముగుండా సర్వరూపములు చూడ
గల్గుచున్నదో జింహ్వేంద్రియముగుండా షడ్రసములను
గ్రహించుచున్నదో స్పర్శేంద్రియముగుండా శీతోష్ణాదులను
గ్రహించుచున్నదో ఘ్రాణేంద్రియముగుండా త్రివిధగంధము
లను మూర్కొనుచున్నదో వాగింద్రియముగుండా వచించు
చున్నదో అట్టి తెలివినే ప్రజ్ఞయని చెప్పుదురు.

శ్లో॥ చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు 2
చైతన్యమేకంబ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి॥

తా॥ యను శుకరహస్యోపనిష ద్వాక్యరీతిగా ఆ యొక్క ప్రజ్ఞ ఎచ్చటనో కొండలు గుహలు అరణ్యములలో గాని లేక కైలాస వైకుంఠాది లోకములలో గాని యున్న దనిగాని భావింపకుందురుగాక. ముందు చెప్పిన శ్లోకప్రకారము మీయొక్క అంతఃకరణవృత్తి యే ఆత్మ దేవుని సాన్నిధ్యమాత్రమున సర్వము చూడగల్గుచున్నదో వినగలుగుచున్నదో అదియే ప్రజ్ఞానమను ఆత్మ. ఆ ప్రజ్ఞానాత్మ ఎచ్చటనున్నదనగా చతుర్ముఖుడగు బ్రహ్మదేవునియందు ఇంద్రునియందును దేవతలయందును మనుష్యులయందును అశ్వము గోవు యీ మొదలగు సాత్విక రాజస తామసోపాధులయం దంతటను పరిపూర్ణముగా వ్యాపించియున్నది. అట్టిచైతన్యమే ఏకస్వరూపమైన బ్రహ్మమనియు ఆత్మయనియు ప్రజ్ఞానమనియు నేననియు ఇత్యాది పదములచే వాడబడుచున్నది.

అందు దేవమనుష్యాదులు, సాత్వికోపాధు లనియు అశ్వగజాదులు తామశోపాధు లనియు అథవా గోగజఅశ్వాదులు రాజసోపాధు లనియు క్రిమికీటకాదులు తామసోపాధు లనియు చెప్పబడినది. కాని అన్నిటియందును గల చైతన్యము మాత్రము యేకరూపముగానే చెప్పబడినది. అథవా సృష్టికి ఆదికారణుడగు హిరణ్యగర్భుని యందును విరాట్టునందును యేపరిశుద్ధచైతన్యము గలదో అదియే నీయందును నాయందును పిపీలికాది బ్రహ్మపర్యంతము తృణాదిమేరూపర్యంతము ఒకే రూపముగా యున్నదని తెలుసుకొనువారే

నిత్యముక్తులని యమధర్మరాజు నచికేతునకు కఠోపనిషత్తు నందు చెప్పియుండెను. అదియునుగాక-

శ్లో॥ అంతఃకరణతద్వృత్తీసాక్షీ చైతన్యవిగ్రహః
ఆనందరూపా సత్యసనాకిమా త్మానం ప్రపద్యసే॥

తా॥ ఓమానవులారా? ఈయాత్మ దేవుడు అంతఃకరణ వృత్తికి సాక్షీమాత్రముగాను చైతన్య స్వరూపముగాను ఉన్నాడు అట్టి సత్యాత్మను ఆనందరూపముగా ధ్యానము చేసి తెలుసుకొనకున్నారేమి! యని శృతిభగవతి మాతవలె మనలకు హితోపదేశము చేయుచున్నది.

శ్లో॥ పరిపూర్ణపరాత్మాస్మిన్ దేహేవిద్యాధికారిణే
బుద్ధేసాక్షితయాస్థిత్వా స్ఫురహనహామితీర్యతే॥ 3

తా॥ సర్వత్రా పరిపూర్ణముగా నిండియుండిన అఖండ చైతన్యమే తన స్వరూపము (అస్మిన్) అని చెప్పుదురు. మనుష్య శరీరముతో శాస్త్రవిచారణ చేయుటకు యోగ్యత గలదు గావున యీ శరీరముతో ఆత్మను తెలియనిచో జన్మంతయు వ్యర్థమైపోవును. బుద్ధికి సాక్షిగాయున్న ఏ తెలివి గలదో అదియే నీస్వరూపము. గాని ఈ శరీరము నీవుకావని శృతివచనము॥

శ్లో॥ సతః పూర్ణపరాత్మాత్ర బ్రహ్మశబ్దేనవర్ణితః
అస్మీత్యైక్యపరామర్శ స్తేనబ్రహ్మ భవామ్యహం॥ 4

తా॥ పరిపూర్ణమగు ఆత్మ స్వయముగనే పరబ్రహ్మ శబ్దము చే వర్ణింపబడుచున్నది. కావున అట్టి పరబ్రహ్మమే

నీవను ఆత్మరూపముగా యున్నదని పదేపదే మహావాక్య శ్రవణమననాదుల ద్వారా పరామర్శించుకొన్నచో యీ జనన మరణాది సంసారసముద్రమును తరింపగలవు.

శ్లో॥ ఏకమేవాద్వితీయం సన్నామరూపవివర్జితమ్
సృష్టేః పురాధునాప్యస్య తాదృక్త్వం తదితీర్యతే॥ 5

తా॥ సృష్టికి పూర్వమందు సర్వము బ్రహ్మమాత్రముగానే యుండెను, అప్పుడు నామరూపము లేమియు లేవు. ఇటీవల భ్రాంతిసిద్ధముచే నామరూపములు కలిపింపబడినవి. అట్టి నామరూపక్రియా రహితమగు పరబ్రహ్మమే నీవై యున్నావు.

శ్లో॥ స్వప్రకాశే పరోక్షత్వమయ మిత్యుక్తితోమతమ్।
అహంకారాది దేహాన్తప్రత్యగాత్మేతిగీయతే॥ 6

తా॥ స్వయంప్రకాశమై పరోక్షముగా చెప్పబడిన నేనను అహంకారాది దేహాంతమువరకుగల ప్రత్యగాత్మయే నేనను పరబ్రహ్మంబగుటవలన శృతియు క్త్యనుభవములచే బాగుగా విచారించి తెలుసుకొనవలెనని చెప్పబడుచున్నది.

శ్లో॥ దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే।
బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకమ్॥ 7

తా॥ ఈ నేత్రాదింద్రియములకు గోచరమగు సమస్త ప్రపంచమును పరమాత్మస్వరూపమేగాని అన్య మెంతమాత్రము గాదు. సర్వము బ్రహ్మ శబ్దముచేతనే చెప్పబడు

చున్నది (సర్వం ఖల్విదంబ్రహ్మ నేహానానాస్తికించన) యను శృతివచనానుసారము సర్వమూ పరబ్రహ్మమే. అట్టి పరబ్రహ్మము స్వయంప్రకాశముగా తన ఆత్మగానే తెలియవలెను.

శ్లో॥ శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్రత్వంపదేరితమ్।
ఏకతాగ్రహ్యతేసీతి తదైక్య మనుభూయతామ్॥ 8

తా॥ స్త్రోత్రాది సకలేంద్రియములకును దేహాదులకు అతీతమై యేవస్తువప్రకాశించుచున్నదో అదియెత్వంపద మనియు; అనగా తత్పదవాచ్యుడగు జీవుడున్ను త్వంపదవాచ్యుడగు పరమాత్మయు ఏకస్వరూపముగా అను సంధానము చేయవలెను. జీవేశ్వరుభయులకును వాచ్యార్థముచే అనగా వ్యష్ట్యుపాధులగు మాయావిద్యలను దృస్యదృష్టిచేతమాత్రమే భేదమున్నట్లు కానుపించినను లక్ష్యార్థముచే వుపాధుల తొలగించిచూచిన "దృశ్యతే జలచంద్రవత్" యను శృతిప్రకారము కుండలోచంద్రుడు నదిలోచంద్రునకు భేదములేనట్లు ఆత్మ పరమాత్మలకు భేదములేదు.

శ్లో॥ అనాత్మదృష్టే రవివేక నిద్రమహం
మనుస్వప్న గతిం గతోహమ్।
స్వరూపసూర్యే భ్యుదితే
స్ఫుటో క్తైర్గురోర్మహావాక్యపదైప్రభుద్దః॥ 9

తా॥ ఓ మానవుడా? అనాత్మయగు దేహదృష్టితో అవివేకమను మూఢనిద్రతో నేను నాదియను అశుభస్వప్నములు అనంతకోటిజన్మల రూపముగా గాంచుచున్నావు.

గావున (శ్రీ) సద్గురువు మహావాక్యోపదేశమను సూర్యోదయ మైనది. ఇకనైనా నీ హృదయకవాటము తెరచి వివేకమను కనులవిప్పి చూడుము, మోక్షమార్గమున ప్రవేశము చేయుము. ఓ ప్రభుద్ధుడా యని శృతిభగవతి మాతవలె తన బిడ్డను ఓ పండితుడా యని ప్రభోదించుచున్నది. గాని పామరుడా యని పిలువలేదు.

అనగా నిర్దోషమగు యాత్మను నియమబద్ధముగా తెలియవలెనని శృతిభగవతి శాసించుచున్నది గావున యిట్టి మహావాక్యమునందు మూడులక్షణములు గలవు. అందు జహల్లక్షణ అజహల్లక్షణ జహదజహల్లక్షణ యని మూడువిధములుగా చెప్పబడినవి. జహల్లక్షణ యనగా-విడచిన లక్షణమనియు అజహాలక్షణయనగా విడువని లక్షణమనియు జహదజహల్లక్షణ మనగా విడచీవిడువని లక్షణమనియు చెప్పెదురు, జహల్లక్షణమందు "గంగాయాం ఘోషః" యనియు అజహాలక్షణకు "మంచాక్రోశంతి" యనియు జహదజహల్లక్షణకు "సోయం దేవదత్తః" అని త్రివిధవాక్యములు చెప్పబడినవి.

జహల్లక్షణ కుదాహరణ:- ఒక సమయమున బాటసారి ఒకడు ఒక గ్రామమునకు వచ్చెను. గ్రామస్థుడొకడు భక్తిశ్రద్ధలతో ఆ బాటసారి కెదురుగాబోయి వినయముతో ఆతనిని తన గృహమునకు తీసుకువచ్చి అర్ఘ్యపాద్యములిచ్చి తగు ఆసనమున కూర్చుండ నియమించి తదుపరి స్నానాది సౌకర్యములు మృష్టాన్నముల షడ్రసోపేతముగా భోజనమిడి

పాన్పుపై పరుండజేసి అథితిసత్కారములు వాని ఫలము బాగుగా నెరింగినవాడగుటచే ఆతని పాదములు వత్తుచు మార్గశ్రమ నివారించెను. అథితి నిద్రమేల్కాంచిన వెనుక గృహస్థుడు వింజామర విసరుచు వినయపూర్వకముగా నిట్లు ప్రశ్నించెను.

హేభగవాన్ ? తమరు ఎచటనుండి వచ్చుచున్నారు. ఎచటకు బోవుచున్నారు. తమరువచ్చు మార్గమునగల విశేషములేమి ? అని ప్రశ్నింపగా ఆబాటసారి యిట్లనియె. నేను వచ్చేమార్గములో "గంగాయాం ఘోషః" యని చెప్పెను. అనగా గంగలో గోల వినవచ్చుచున్నది అని ఆబాటసారి తన మార్గమున బోయెను. తరువాత ఆగృహస్థుడు తన కుశలత్వ బుద్ధితో ఆవాక్యము యిట్లు విచారింపనెంచి ఆబాటసారి వచ్చినమార్గము నాశ్రయించిబోవుచు గంగలో గోల ఎట్లు కలుగును. నదిలో బడినవారు మరణింతురుగదా! వాక్కు అగ్నితత్వమగుటచే జలముచే నశించునుగదా యని విచారించుచూ కొంతదూరముబోవగా ఆదారిమార్గమున గంగానది ఒకటిగలదు. ఆనదివద్దున ఒక గొల్లపల్లెగలదు ఆగొల్ల పల్లెలో గోల వినవచ్చుచున్నది. అందులకు ఆగృహస్థుడు ఓహో యీగొల్లపల్లెలో చోరభయముగాని, లేక సర్పభీతిగాని అథవా అగ్నిభయముగాని, లేక వివాహాది సందర్భములచేతనో లేక మరణముచేతనో యిట్లుగోల ఆగ్రామస్థులు చేయుచుండవచ్చునని నిశ్చయించుకొని తిరుగా తనగృహమునకువచ్చెను.

గావున "గంగాయాం ఘోషః" యను వాక్యములో గంగనువిడచి గంగవద్దుననున్న గొల్లపల్లెలో గోలయ గ్రహించునట్లు లక్ష్యార్థమందు ఆత్మచైతన్యమునువిడచి "మత్సాన్నిధ్యాత్ప్రవర్తంతే దేహాదిఅజడాయివ" పరమాత్మసాన్నిధ్యమాత్రమున దేహాదులు జడములైనను చైతన్య వస్తువులాగున పనులు చేయుచున్నవి. కావున ఆత్మ గంగా వదివంటిది. దేహాదులు గొల్లపల్లెవంటివి. చైతన్యాత్మ సహాయములేనిచో దేహాదులు కాష్టపాషాణవతుగా జడములె గావున ఆత్మ సాన్నిధ్యమాత్రమున సుఖదుఃఖాది వ్యాపారములు శరీరాదులద్వారా మనస్సునకు కలుగుచున్నవి. అందువలన చైతన్యాత్మను విడచి

శ్రు॥ కర్తృత్వ భోక్తృత్వ సుఖదుఃఖాదిలక్షణశ్చిత్తధర్మః। క్లేశరూపత్వాత్ బంధోభవతి తన్నిరోధనంజీవన్ముక్తిః॥ యను ముక్తికోపనిష వాక్యరీతిగా కర్తృత్వము భోక్తృత్వము సుఖము, దుఃఖము మొదలగునవి చిత్తధర్మములే గాని, ఆత్మధర్మము లెంతమాత్రము కావు. పంచక్లేశముల దోషముచే చిత్త మనేకవికారముల నొందుచున్నది. అట్టివికారములు బోధాజ్ఞానమువలన నివారింపజేసుకొనినచో నిజమగు జీవన్ముక్తి సుఖము వెంటనే సిద్ధించును. అందువలన యిది విడచినలక్షణమని చెప్పబడును. అనగా సుఖదుఃఖాదులుఅంతఃకరణధర్మములేగాని ఆత్మధర్మములు గావని తెలియుట-

ఇంక అజహల్లక్షణ కుదాహరణ చెప్పబడుచున్నది— ఒక బాటసారి ఒక సమయములో ఒక గ్రామమునకు వచ్చుచుండగా ఆగ్రామస్థుడొక డతని కెదురేగి ముందు చెప్పిన ప్రకారము అర్ఘ్యపాద్యాది విధులచే పూజించి స్నానపానాది సౌకర్యములతో షడ్రసోపేతమగు మృష్టాన్నాదులచే తృప్తినిగా చేసి తదుపరి పాన్పుపై బరుండ జేసి పాదము లొత్తుచుండగా కొంతతడవునకు అథితి శ్రమనివారించుకొని లేచెను. అప్పుడు వింజామర వీచుచున్న గృహస్థుడు వినయపూర్వకముగా అథితిని యిట్లు ప్రశ్నించెను.

అయ్యా! తమరువచ్చు మార్గమున విశేషములేమి? యనిన అథితి "మంచాక్రోశంతి" నేనువచ్చు మార్గమున మంచలు మాట్లాడుచున్నవి. అనిచెప్పి అథితి తనమార్గమున బోయెను. ఆమాటవిని గృహస్థుడు తన కుశలత్వబుద్ధిచే మంచలెట్లు మాట్లాడగలవో చూచెదగాక. యని బాటసారి వచ్చిన మార్గము ననుసరించి పోవగా కొంతదూరమున పొలములో అరపలు వేసుకొని రైతువారు ఆ అరపలపైన కూర్చొని రాత్రులందు చోరభయము వ్యాఘ్రాదిభీతి మొదలగునవి కలగకుండులాగున వారివారి మిత్రులను పుత్రులను పిలచుకొనుచుండెను. అదిచూచి ఆశబ్దములువిని ఓహో మంచలపైనున్న మనుష్యులు మాట్లాడుచున్నారేగాని జడమగు మంచలెట్లు మాట్లాడగలవు. అని తెలసుకొనెను. గాన మంచను విడువకుండగనే మంచపైనున్న మనుష్యులను గ్రహిం

చులాగున చైతన్యాత్మను గ్రహించుటకు దేహాది జడసంఘా తమును గ్రహించవలెను. అదెట్లనగా.

శ్లో॥ తిలేషుతైలందధినీ వసర్పిరాపస్స్రోతస్వరణీషుచాగ్నిః।
ఏవమాత్మవిజాయతే సౌసత్యేనతపసాయోనుపశ్యతి॥

తా॥ నువ్వులలో నూనెయు, పెరుగునందు వెన్నయు తరంగములలో జలము, అరణిలో అగ్నియు, ఎట్లు వాదిగి యున్నవో అట్లే, యీ శరీరమందు ఆత్మదేవుడు చైతన్య రూపముగా, నఖశిఖాగ్రమువరకు వ్యాపించియున్నాడు. అట్టి పరమాత్మను తపస్సుచేతనే చూడవచ్చును. అనగా "మన శుద్ధం గురోర్వాక్యం। పునర్జన్మం నవిద్యతే॥" యను గర్భగీతోపనిషద్వాక్య రీతిగా, గురువాక్యమునందు నమ్మకము, తన అంతఃకరణశుద్ధి యీ రెండే తపస్సుయొక్క స్వరూపము. గాన వాసనాక్షయ, మనోనాశనములచేత తత్వజ్ఞాన దారుఢ్యము నొందగా అచిరకాలములోనే జీవన్ముక్తి, విదేహముక్తులు సిద్ధించును. అట్టివానికి జన్మలేదు. కాబట్టి దీనికే అజహార్లక్షణ మను విడువనిలక్షణ మందురు.

తరువాత అజహాలక్షణములోనే "చత్రంగచ్ఛతి" "చామరంగచ్ఛతి" "శస్త్రాన్‌గచ్ఛతి" యని చెప్పబడినది. అనగా యీటెలు, బల్లెములు, గొడుగులు, విసనకర్రలు వెళ్ళిపోవుచున్నవి. అని చెప్పటలో యీటెలు మొదలగు నవి జడములగుటచే, అవి యెంతమాత్రమూ నడువజాలవు.

కావున యీ తెలు బల్లెములు పట్టుకున్న మనుష్యులే నడచుచున్నారు. యని గ్రహించుచున్నట్లు, జడమగు దేహేంద్రియాదులు ఏలాంటి కార్యములు చేయజాలవు. అందువలన యీ శరీరములో చైతన్యరూప దేవుని తెలియవలెను.

కాని అట్టి ఆత్మదేవుని తాను గురుశాస్త్రాదుల సహాయమునను, పరిశుద్ధాంతఃకరణము వలనను, బాగుగా విచారించి శాఖాచంద్రన్యాయమున తెలసికొన్ననూ, యీ నేత్రాదులకు మాత్రము ఆత్మగోచరముగాదు ఎట్లనగా బుట్టబొమ్మఆడుచున్నట్లు కానుపించిననూ అది జడము. దానికి ఆడేశక్తి యెంతమాత్రమునూ లేదు. దానిలో మనుష్యుడుండి ఆడించుచున్నాడు. ఆ మనుష్యుని మనము తెలసికొన్ననూ బుట్టబొమ్మ అడ్డుగా యున్నందున ఆ మనుష్యుడు, మన కంటికి కానుపించడు. అట్లుగనే ఆత్మదేవుని విచారపూర్వకముగా తెలసికొన్ననూ, శరీరరూప బుట్టబొమ్మ అడ్డుగా యున్నందున ఆత్మ కానుపించుటలేదు.

తరువాత మూడవదియగు జహదజహల్లక్షణ ఉదాహారణతో సహా చెప్పబడుచున్నది. జహదజహల్లక్షణమనగా విడచీవిడువని లక్షణం "సోయం దేవదత్తః" ఆ దేవదత్తుడే యీ దేవదత్తుడు. అని చెప్పుటలో, వకవుదాహారణ-రంగడు యను నామముగల ఒకడు, పాతికసంవత్సరముల వయస్సునపట్టుబట్టల వర్తకము చేయుచు, విలువగల దుస్తులు ధరించి, రామేశ్వర క్షేత్రములో లింగనికి కనుపించెను. అటుతరువాత

కొంతకాలమునకు, కాశీక్షేత్రములో వర్షాకాలమున, యేబది సంవత్సరముల వయస్సున, దరిద్రావస్థలో జీర్ణవస్త్రములు ధరించియుండగా, లింగ డనువాడు ఆ రంగని చూచెను. ఆతనినిచూచి ఓయీ నీవు ఆరంగడవేగావ. యని ప్రశ్నించెను. అనగా ఆ రంగడే యీ రంగడని తెలసికొను టెట్లనిన. ఆ క్షేత్రము, ఆ కాలము, ఆ దేశము, ఆ ధనము, ఆ దుస్తులు, ఆ వయస్సు అన్నీ మారినవే. ఆతడే యీతడని ఎట్లు గ్రహించె ననగా-కంఠధ్వనిని బట్టి ఆ రంగడే యీ రంగడని గ్రహింపబడెను. అదేవిధముగా ఒకేపురుషుని శరీరమందుగల, బాల్య యౌవ్వన, కౌమార, వృద్ధాది అవస్థలు మార్పు చెందుచున్నను, అట్టి శరీరమునకు అధిష్టానమగు ఆత్మ కెటువంటి మార్పులు లేవు. కాబట్టి-

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వాసర్వంబంధైః ప్రముచ్యతే॥

తా॥ యను కైవల్యశ్రుతివాక్య ప్రకారము జాగ్రత, స్వప్న, సుషుప్తి యను మూడవస్థలను యే చైతన్యాత్మచే ప్రకాశింపచేయ బడుచుండెనో, ఆ యాత్మయే పరబ్రహ్మ మనియు అదియే యదార్థస్వరూప మనియు, ఎవరు తెలసుకొందురో వారికి సమస్త బంధములు నశించిపోవుచున్నవి యని చెప్పబడినది.

శ్లో॥ ఏకఏవాత్మమంతవ్యో జాగ్రత్స్వప్నసుషుప్తిషు
స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మనవిద్యతే॥

తా॥ అను అమృతబిందూపనిషద్వాక్యరీతిగా ఒకే యాత్మ జాగ్రస్వప్న సుషుప్తులకావల తురీయాతీతమందు తాను స్వయముగా వెలుగుచు యీ చతురావస్థలనుగూడా వెలిగింపజేయుచున్నాడని ఎవరు తెలిసికొందురో వారికిక పునర్జన్మము లేదని చెప్పబడినది. కాబట్టి యీఆత్మ శరీర త్రయ విలక్షణుడు. అవస్థాత్రయసాక్షి పంచకోశవ్యతిరిక్తుడు అని తెలియవలెను.

అదియునుగాక మాయోపాధికుడగు ఈశ్వరునకును, అవిద్యోపాధికుడగు జీవునకును వ్యవహారదశలో అథవా అజ్ఞానదశలో భేదమున్నట్లు కానుపించిననూ పరమార్థదశలో ఎటువంటిభేదము లేదు. దీనికి భాగత్యాగలక్షణమని కూడా చెప్పుదురు.

అదిఎట్లనగా కృషివల్యుడు ధాన్యాదులు పండేవరకూ గడ్డిరూపమగు చేనును భద్రముగా రక్షించునుగదా! పండిన వెనక జానెడు కణికెలవంతున విడచివేసి పైనున్న వరివెన్నులతోగూడినచేను కోసివేసి ధాన్యాదులుగలది గ్రహించును, క్రిందిభాగము త్యాగముచేయును. తదుపరి కుప్ప వేసి నూర్చునపుడు గడ్డంతయు వేరుగాతీసివేసి ధాన్యాదులను గ్రహించును. తరువాత చేటలచే ధాన్యాదులు తూర్పారపట్టి అందు గల పొల్లంతయు దూరముగా కొట్టివేయును. అట్లు క్రమముగా భాగించుచూ పనికిరానిదానిని త్యాగించుచు వచ్చి, పిండియు ధాన్యాదులు మిల్లులలో బోయుసరికి రాయి బెడ్డ

వేరుగను, ఊక చిట్టు తవుడు వేరుగను, బియ్యము వేరుగను విభాగించుకొని అవసరపువస్థువులు త్యాజ్యముచేసి, బియ్యమునుమాత్రమే పూజ్యమని తనగృహమున చేర్చి, యింకను నూకలు మొదలగు పదార్థములను చేటలతోను, జల్లెడతోను విభాగించి తుదకు బియ్యముకడిగి, అందుగల కడుగుపారబోసి బియ్యము వుడికినవెనుక గంజినీటిని వేరుగాతీసి మిగిలిన అన్నము తాను భుజించునుగదా. యిదంతయు భాగత్యాగమే. అటుతరువాత తిరుగా తనశరీరములో ప్రవేశించిన అన్నపానాదుల విచారింతము–

అన్నము జఠరాగ్నిచే స్థూలభాగము, సూక్ష్మభాగము, సూక్ష్మతరభాగము యని మూడుభాగములుగా మారుచున్నది. జలమును త్రివిధముగా మారుచున్నది. అందు అన్నముయొక్క స్థూలభాగము మలముగ బోవుచున్నది. అందు సూక్ష్మభాగము మాంసముగను, సూక్ష్మతరభాగము మనస్సుగను మారుచున్నది.

తరువాత త్రాగిన జలమున్ను, స్థూలభాగము మూత్రముగను, సూక్ష్మభాగము రక్తముగను, సూక్ష్మతరభాగము ప్రాణశక్తిగను మారుచున్నది.

శ్రు॥ "ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః" యను శృతిప్రకారము ప్రాణము, మనస్సు ప్రజ్ఞానాత్మసాన్నిధ్యమున సర్వక్రియలు చేయగలుగుచున్నవి.

ప్రాణప్రజ్ఞలు కలియనిదే మనస్సున్నూ, జడసంభంద మగుటచే యేకార్యమున్ను చేయజాలకున్నది. కావున ముందు చెప్పినప్రకారము దేహాది సకలజడసంఘాతము పంచీకరణ శాస్త్రముచే విభాగించి, కేవల సాక్షీమాత్రమగు ఆత్మను మాత్రమే గృహమందు దీపశిఖవలె గ్రహించవలెను. యిదియేభాగత్యాగ లక్షణమని చెప్పబడును.

అదియునుగాక ఒకసమయమున చైత్రు డనువాడు మైత్రునిగృహమునకు వచ్చి, దేవదత్తుని గృహ మేదియని అడుగగా, అతడు అదియే దేవదత్తుని గృహమని చెప్పిననూ అనేకగృహములమధ్య నున్నందున వానికి గురుతు దొరకనందున ఆసమయమున వానిగృహము వాకిట కాకి నిలచినది. ఆగురుతు చూపినందున దేవదత్తుని గృహములోనికి వచ్చి చూడగా శుకశారికాది పక్షులుకూడా యున్నందున దేవదత్తుని చూచెను.

తరువాత కొంతకాలమైనవెనుక తిరుగా మైత్రుని గృహమునకు చైత్రుడువచ్చి దేవదత్తునిగృహము చూపుమనిన ఆతడు అదియే దేవదత్తునిగృహమని చెప్పెనుగాని, ఆ నాటికాకిగాని శుకశారికాదులును గురుతుచూపమనిన ఆతడు ఓహో! ఆనాడువాలినకాకి యింతవరకూ నిలచునా? ఆనాడే ఎగిరిపోయినది. అట్లుగనే శుకశారికాదిపక్షులును కొన్నిదినాలనాడే నశించిపోయెనని చెప్పెను. అదేవిధముగా-

అజ్ఞానదశలోనున్న జీవభ్రాంతియే కాకివంటిది. మిథ్యాసంసారవాసనలే శుకశారికాదిపక్షులవంటివి. సద్గురుసన్నిధిచేరుటతోడనే జీవభ్రాంతి శిథిలమగును. క్రమముగా సద్గురుముఖమున మహావాక్యార్థోపదేశము పదార్థసహితముగా తెలసుకొన్నతక్షణమే వాసనాక్షయ మనోనాశములు కలిగి తత్త్వజ్ఞానసిద్ధిచే జీవన్ముక్తియు ప్రారబ్ధక్షయమైనవెంటనే విదేహకైవల్యమున్నూ సిద్ధించును. యిందుకు ప్రమాణమేదనగా—

శ్రు॥ ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావ దేతి।
చిరంయేవన్నవిమోక్షేద సపత్స్యతయితి॥

తా॥ అను చాందోగ్యోపనిషత్ ప్రమాణానుసారముగా శుద్ధాంతఃకరణగల అధికారి బ్రహ్మవేత్తయగు సద్గురుముఖమున, మహావాక్యోపదేశము పదార్థసహితముగా ఎప్పుడుపదేశము పొందుచున్నాడో, ఆయధికారి ఆ జన్మలోనే, ఆ శరీరముతో నుండగనే ఆ దినమే ఆ స్థలములోనే ఆతక్షణమే ఆ యడుగులోనే అవిద్యావిముక్తుడగుచున్నాడు. అదెట్లనగా—స్వప్నమునందలి సింహవ్యాఘ్రాదుల యొక్కయు, జారచోరాదుల యొక్కయు భయభ్రాంతులు, జాగ్రతకలిగిన తక్షణమె ఎట్లునశించిపోవుచున్నవో, అట్లుగనే బ్రహ్మోపదేశముచే, అజ్ఞానవాసనారూప ప్రపంచక స్వప్నము నశించిపోవుచున్నదని చెప్పబడినది. బ్రహ్మసూత్ర వాక్యము చూడుడు.

సూ॥ నైనంపాప్మాతరతి। సర్వంపాప్మాతరతి॥

తా॥ బ్రహ్మవేత్తను పాపము దాటలేకున్నది. మరేమనిన, బ్రహ్మవేత్తయే పాపసముద్రము దాటుచున్నాడు. ఇందుకుదాహరణ–

శ్రీరామచంద్రమూర్తిచే ప్రయోగింపబడిన బ్రహ్మాస్త్రము, రావణవక్షస్థల విచ్ఛేదన వకటిమాత్రమేచేసి పూరుకొనక, వక్షస్థలవిచ్ఛేదము, అమృతకలశాపహరణము, ప్రాణనాశము, దేహపాతము, యీనాల్గు కార్యములు యేక కాలములోనే చేసినట్లు, బ్రహ్మవేత్తచే ప్రయోగింపబడిన, బ్రహ్మజ్ఞాన రూపాస్త్రమున్ను, ఒకేకాలములోనే అజ్ఞాన చ్ఛేదము, ఆవరణరూప అవిద్యాహరణము, సర్వపాప క్షయము, జన్మరాహిత్యము, ఏకకాలమందే చేయుచున్నదని చెప్పబడెను. తరువాత పదార్థసహితముగా, వుపదేశమెట్టిదనగా–తత్। త్వం। అసి॥ యను మూడుపదములలోను. సమిష్టిరూపుడగు యీశ్వరుడును, వ్యష్టిరూపుడగు జీవుడును, తదుభయ చైతన్యైక్యుడగు బ్రహ్మవేత్తయనియు చెప్పబడును. ఇందు పదార్థమునకుదాహరణ.

ఒక గృహస్థుల గృహమున, చిరకాలమునుండి సేవకుడొకడు వుండెను. అతను యజమానియందు ఎంతో వినయ విశ్వాసములతో సేవించుచుండెను. వారున్ను వుత్తములగుటచే, సేవకులను గౌరవభావముగను, దయామాత్రముగను చూచుచుండెడివారు. సేవకుడును ధర్మప్రవర్తన సత్యబుద్ధి

కలిగి జీవిత శేషమును గడపుచుండెను "నీచసేవానకర్తవ్యాం మహదాశ్రయః"

తా॥ యను న్యాయానుసారము, నీచులసేవమాత్రము ఎన్నటికీ చేయగూడదు. మహాత్ముల సేవదొరుకుట బహు దుర్లభము. కాబట్టి దొరికినచో బహుజాగ్రత్తగా కాపాడు కొనవలెను. అట్టి వృత్తముల సేవచే ఇహమందు కీర్తి, పర మందు మోక్షము కూడా లభించును. నీచసేవవలన జీవిత ములో అనేకయిక్కట్లు సంభవించుటయేగాక, ఇహమందప ఖ్యాతి, పరమందు నరకాదులుకూడ కలుగును. అందుచే ఆ సేవకుడు తన కుమారుని, ప్రభువుల కృపకు పాత్రునిచేయ దలంచి, తనతోకూడా ప్రతిరోజును వెంటతీసుకుపోయి ఇట్లు చెప్పుచుండెను. కుమారా! ప్రభువులు నాకేమి శెలవిచ్చె దరో నేను ఏయేకార్యములు చక్కపెట్టెదనో నీవన్నియూ జాగ్రత్తగా చూచుచూ, వినుచుండినఎడల బాగుగా బోధ పడగలవు. గాన కనిపెట్టుమని చెప్పెను. కుమారు డట్లనే నిదానముగా వినుచూ చూచుచూనుండెను.

ప్రభువు ఒకప్పుడు "హేభృత్యా! శుక్లాంగాదండే నానయ" యని చెప్పెను. దీనిభావమేమనగా- ఓ సేవకుడా! తెల్లనిగోవును కర్రతో తోలుకొనిరమ్ము. అనినంతనే సేవ కుడట్లుగనే గోవులను తీసుకొనివచ్చెను. తరువాత "గాంబంధ యతి" గోవును కట్టివేయుము. "క్షీరంవిచ్ఛిజ్య' 'గాంవి చ్ఛిజ్య" అనుటలో పాలుతీయుము. గోవును బయటికి పంపి

వేయుము. అని ప్రభులవారు ఆజ్ఞచొప్పున సేవకుడట్లు క్రమముగా ఆ యా కార్యములు చక్కపరచుచుండెను. తరువాత సేవకునికుమారుడు యీశబ్దములకు మొదటిఅర్థము తెలియక పోయిననూ, తనతండ్రి చేసే కార్యములనుబట్టి ఓహో! యీ శబ్దములలోగల అర్థమిదియా యని తెలసుకొనుచూ, ఆయా శబ్దములను మననముచేయుచుండెను. తరువాత ఒకదినము ప్రభువు "హేభృత్యా! సైంధవ ఆయ" యని బిగ్గరగా పలికెను. అప్పుడు సేవకుడు దూరముగా గోశాలలో యేదో పనిచేయుచుండెను. ప్రభులవారు హేభృత్యాయను శబ్దముచ్చరించుసరికి చిత్తం చిత్తం యని చేతులును నులుముకొనుచూ ప్రభుసన్నిధికి పరుగున కనులకు ప్రభువు కనబడు వరకువచ్చి, ప్రభువు ఏమిచేయుచుండెనో చూచి, తరువాత వెంటనే తొందరగాబోయి ఆ కార్యము చక్కపరచెను. అనగా సైంధవమాయ యనుటలో రెండర్థములు గలవు.

సముద్రములో వుప్పు ఫుట్టినది, అశ్వముపుట్టినది. కావున సైంధవమాయ యనుటచే ఉప్పును తీసుకురావలెననియును, లేక లవణముతీసుకురమ్మని యనికూడా అర్థమగుచున్నది. అందువలన ప్రభువు భోజనముచేయుచున్నచో లవణము తేవలెను, దుస్తులుధరించి వీధిలోనిలచినచో అశ్వముతీసుకురావలెను. కావున 'హేభృత్యా' యనునంతనే తొందరగాపరుగెత్తుకొనివచ్చి ప్రభు వేస్థితిలోయున్నదీ కనిపెట్టి ఆయాసమయానుగుణముగా కార్యములను నెరవేర్చుట

మంచిది. అట్లుగానిచో భోజనసమయమున అశ్వమును తెచ్చి ననూ, వీధిలోనికిబోవునపుడు లవణమును తీసుకుపోయిననూ వైపరీత్యముకలిగి, శిక్షకు పాత్రుడు కావలసి వచ్చును. అందు వలన ప్రభువు హేభృత్యా యనిన తత్క్షణమే పరుగునవచ్చి ప్రభు వేమిచేయుచున్నది చూచి, ఆయాకార్యములు చక్క బరచుటలో కడుజాగరూకుడుగా సేవకుడు పనిచేయవలెను. అని పెద్దలు శాస్త్రములు అనేకముఖములతో చెప్పుచుండు టకు కారణము. అథవా ప్రభువు విషయములో భృత్యులే కాదు. సద్గురువు సన్నిధానమున, సశ్శిష్యుడును, తండ్రిసాన్ని ధ్యమున పుత్రుడును కూడా మహాభయభక్తులు కలిగి సంచ రించిననే కృతార్థులగుదురు. కాని భయముండి భక్తిలేకున్న నూభక్తిగలిగి భయము లేకున్ననూ, చెడిపోవకతప్పదు. భయముచే ఇహలోకము, భక్తిచే పరలోకమున్ను రక్షింప బడుచున్నవని పెద్దలు చెప్పుదురు.

అందువలన సద్గురువులవారు పరుండియున్నపుడు ఏదే నియుమాట శిష్యునకు చెప్పినచో, శిష్యుడు పరుండియు న్ననూ, లేచికూర్చుని విని తగుసమాధానము చెప్పవలెనే గాని పరుండియే బదులుచెప్పకూడదు. అథవా గురువుల వారు కూర్చుని ఏదేనియు శిష్యునకు చెప్పినచో, లేచి నిలువబడి సమాధాన మీయవలెను. వారు నిలువబడి చెప్పి నచో తాను ఎదురేగి సమాధాన మీయవలెను. వారు నడ చుచూ చెప్పినచో తాను పరుగిడివచ్చి బదులుచెప్పవలెను.

యిట్లు భయభక్తులుకలిగి సంచరించినవారు, ఇహమందు కీర్తి పరమందు మోక్షము పొందుదురు.

లక్షణములు త్రివిధముగాకూడా చెప్పబడినవిముందు చెప్పిన జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ యను మూడింటి రహస్యములు పైని తెలుపబడియే యున్నవి.

తరువాత త్రివిధవృత్తులుకూడా యున్నవని చెప్పుదురు. అందు ఒకటి అభిధావృత్తియనియు, రెండు లక్షణావృత్తియనియు, మూడు వ్యంజనావృత్తియనియూ చెప్పబడు త్రివిధవృత్తులలోను, మొదటిదియగు అభిధావృత్తియొక్క స్వరూపమేది యనగా-శాస్త్రవాక్యమందును, గురువాక్యమందును, శబ్దమునకు సంబంధించిన అర్థమునే గ్రహించి, తదితరధర్మము లేమియు, తెలుసుకొనకుండుట అభిధావృత్తి యనియు, రెండవదియగు లక్షణావృత్తి యేదియనగా, కాశీయాత్రకు బోవువారు గోమామీదుగా బోయిన సులభముగా కాశీ చేరవచ్చును. అని చెప్పుటలో గోమామీదుగా యనిన గోమాయను గ్రామములో ఒక త్రోవగుండాప్రయాణము చేయవలెనని ఊహించుటయేగాని, గోమా యను దానిపై నెక్కి పోవలెననికాదు. గోమాయనునది ఏనుగయూ గుర్రమూ, ఎక్కిపోవుటకు అట్లుగనే లక్షణత్రయముచే ఆత్మను తెలసుకొనుట లక్షణావృత్తియని చెప్పబడును.

మూడవదియగు వ్యంజనావృత్తి-దీనికినీ వ్యవహార పరమార్థములు తెలసుకొనుటకు తగిన సాధనములగు ఆయా ఉపమానములతో యదార్థము తెలియువరకూ బోధించుట.

ఇందు అభిధావృత్తి మాత్రమే గలవారు సామాన్య జనులనియు, లక్షణావృత్తిగలవారు మధ్యములనియు, వ్యంజనావృత్తిగలవారు ఉత్తములనియు తెలియవలెను. అంజనాదేవికి, ఆంజనేయ భగవంతుడు వాయువంశచే యీశ్వరుడే అవతరించెననియు, అట్టివాడు సూక్ష్మబుద్ధిచే, చూచిరమ్మంటే కాల్చి వచ్చినాడనియు చెప్పు రహస్యము వ్యంజనావృత్తియే అంజనాదేవి యనియు, అట్టి వృత్తివలన కలిగిన జ్ఞానాంజనమే ఆంజనేయుడనియు, అనగా విచారసహితమగు శుద్ధబుద్ధిచే, యేవస్తువును గాంచుచున్నామో, అద్దానిని శతనేత్రధారియగు ఇంద్రుడుగాని, త్రినేత్రధారియగు జగధీశ్వరుడుగాని చూడజాలకనే యున్నారు. అని శ్రీయోగవాశిష్టమున చెప్పబడినది. అట్టి విజ్ఞానరూపుడగు, ఆంజనేయుడు లంకాదహనముచేయుట ఏదియనిన-లకారాది క్షకారాంతము వరకూ గల మానవశరీరములో గల దృష్టవృత్తుల నన్నిటిని తగులబెట్టినాడని తెలియవలెను.

అదెట్లనగా-లకారబీజము ఆధారచక్రమునందుగలదు క్షకారబీజము భ్రూమధ్యస్థానమున ఆజ్ఞేయచక్రమునందు గలదు. కాక్రింద వ్రాసిన షకారము అవసరములేనిఎడల తీసివేసి, కకారమును మాత్రమే గ్రహించవచ్చును. అందువలన కకారాది క్షకారాంతము వరకూగల, సప్తచక్రములతో కూడిన శరీరమునందు, ఆజ్ఞేయచక్రము దాటి, ఏ యొక్క పుణ్యాపాపాది వాసనలు రావు. ఆధారం మొదలు

కొని విశుద్ధచక్రమువరకూగల దుష్టవాసనలను విజ్ఞానాగ్నిచే కాల్చివేసినాడు. గావున లంకాదహనముయొక్క రహస్య మిదియని గ్రహింపనగును.

తరువాత ప్రయోజనలక్షణమనియు, ప్రవృత్తి లక్షణ మనియు కూడా రెండులక్షణములుగలవు. అందు ప్రయోజన లక్షణమేదియనగా గంగయొక్క పవిత్రత శీతలత్వాదులు గొల్లపల్లెకు ప్రయోజనమున్నది గాని, గొల్లపల్లెయొక్క గోల గంగకుయేమాత్ర ముపయోగము లేదు. అట్లుగనే ఆనందా త్మయొక్క సాన్నిధ్యమాత్ర దేహేంద్రియాదులకు ఆత్మ యొక్క చైతన్యశక్తి, పవిత్రత, దేహాదులకు ప్రయోజన కారి కావచ్చును. గాని దేహాదుల అనృత, జడ, దుఃఖత్వా దులు ఆత్మకేవిధా ప్రయోజనము లేదు.

తరువాత ప్రవృత్తిలక్షణ మేదియనగా "కాకేభ్యో దధిరక్షితామ్" కాకులనుండి పెరుగును రక్షించుము అనుటచే ఒక కాకులనుండియేగాను, మూషక మార్జాలాదులచేకూడా పెరుగు పాడుగాకుండగా రక్షించుకొనుము యని చెప్పబడి నది. అటులనే "ఆత్మానంసతతంరక్షేత్ దారైరపిధనైరపి" యను న్యాయానుసారము, ఓ మానవులారా! స్త్రీ పుత్రా దులను కాకులు మార్జాలాదులద్వారా మీ ఆత్మజ్ఞానమను దధి పాడుగాకుండులాగుల రక్షించుకొనుడు అనగా దార, పుత్ర, ధనాదులపై ప్రీతి, వేశ్యాప్రీతివలె భోగార్థమే యగు చున్నది. అటులనే ప్రాణాదులపైగల ప్రీతియు సహేతుకమే

గాని, నిర్హేతుకముగాదు. అదెట్లనగా గోవును పోషించుట పాలకొరకే యగుచున్నది. అట్లుగనే దేహాది సకల సంఘాత మునకు ఆరోగ్యాది సౌకర్యముండిననే వాటివలన కించిన్మాత్ర ప్రయోజనసిద్ధి యగుచున్నది. గాని లేనియెడల బలవన్మరణ మునకునూ హేతువగుచున్నది. గావున ప్రత్యగాత్మయందలి ప్రీతియన్ననో నిర్హేతుకము, నిరతిశయము, నిత్యము, స్వభావము. అదెట్లనగా అగ్నియందలి వేడిమి స్వభావమగునట్లు ప్రత్యగాత్మయందలి ప్రీతియు స్వాభావమే.

వాచ్యార్థము, లక్ష్యార్థము యని రెండు విధములు. దధిరక్షణవలె ఆత్మలక్షణ లక్ష్యార్థము శాఖాచంద్ర న్యాయముగా దేహాదులు వాచ్యార్థములో చేరినవి. ఒక్కొక్క సమయమున వాచ్యార్థము విడచివేసి లక్ష్యార్థమునుమాత్రమె గ్రహింపవలసియుండును. ఒకొ్కక్క సమయమున వాచ్యార్థ లక్ష్యార్థలక్ష్యార్థముల రెంటినీకూడా అంగీకరింపవలసివచ్చును, కాబట్టి వివేకబుద్ధితో చూచుకొనవలెను.

అదియునుగాక ముందుచెప్పిన పెరుగును కాకులు మొదలగువాటినుండి రక్షించునట్లు ఆత్మజ్ఞానమును స్త్రీపుత్రాది మోహభ్రాంతిచే నశింపకుండునట్లు రక్షించుకొనవలెనని చెప్పుటకు కారణమేమనగా లోకములో నవికాయంత్రము ఒకటిగలదు. అది పుష్పరసమును హరించు సాధనయని ఉపనిషత్తులలో చెప్పబడియున్నది. కావున అట్టి నవికాయంత్రమువలన పుష్పరసము హరించుటవలన అచిరకాలము

లోనే పుష్పముయొక్క శోభయు, కోమలమును నశించిపోవు నట్లు భర్తకు భార్య నవికాయంత్రముగాను, భార్యకుభర్తయు, మాతాపితలకు పుత్రాదులు నవికాయంత్రములుగాను చెప్ప బడెను.

అదెట్లనగా- భర్తకు భార్య నవికాయంత్రముగా యున్నందున, ఆతని వీర్యరూపరసమును హరించుటవలన, ఆతని బుద్ధి, జ్ఞానము, వివేకాదులు నశించిపోవుచున్నందున, ఆతడు ఇహాపరములలో ఎటువంటి యోగ్యతయు పొందజా లక, దుర్లభమగు మానవజన్మమంతయు గోలుపోవుచున్నాడు అట్లుగనే, భర్త భార్యకు నవికాయంత్రమువలె నున్నందున, ఆమెతాలూకు సత్య, ధర్మ, దయాది సర్వసుగుణములు నశిం చిపోవుటచే, ఇహాపరములకు దూరమగుచున్నది. అట్లుగనే పుత్రాదులను నవికాయంత్రముచే, మాతాపితలయొక్క జ్ఞానవిజ్ఞానాది రసములు హరింపబడినందున, మూషకమార్జా లాది నీచజన్మలనే, యెత్తవలసివచ్చుచున్నది. కాబట్టి వాత రోగపీడితునకు, ముష్టిప్రహారము, సుఖరూపముగా గోచరిం చుచున్నట్లు విషయాసక్తచిత్తునకే, సంసారము సుఖముగా గోచరించును. అనగా, శరీరము సలుపు పీకు మొదలగునవి, వాతరోగలక్షణము లగుటచే, ఆబాధలు గలవారికి శరీరము కాలు చేతులతో కుమ్మవేయుచుండినచో, వారికి కొంత శాంతి యున్నట్లు కానుపించును. గాని అట్టి బాధలేనివారికి,

ఇతరమనిషి సమీపముగా కూర్చున్ననూ, బాధగా నేయుం డును. అట్టితరి పిడికిలిపోట్లు సుఖమిచ్చునా? అలాగున ప్రారబ్ధముచే, విషయాభిలాష గలవారికి మాత్రమె, సంసారము నందు సుఖమున్నట్లు కానుపించును.

శ్లో॥ సౌఖ్యంబిందుమాత్రేణ। దుఃఖంపర్వత మేవచ॥

యను ప్రమాణానుసారము, సంసారమున మిథ్యా సుఖము ఒకబిందువుమాత్రము కానుపించిననూ, పర్వతా దులవలె దుఃఖముల నిచ్చును. కావున బుద్ధివంతులు అల్ప సుఖముల కాశించక. కేవల నిత్యసుఖమునిచ్చు మోక్షజ్ఞాన మునే సంపాదింతురు.

అవిన్నిగాక, లోకములో భేరీనాదమనియు, శంకా నాదమనియు, వీణానాదమనియు మూడువిధములగు ధ్వనులు గలవు. అందు భేర్యాది శబ్దములలో, భేదము, ఖేదము, మోదమేగాని చిత్తస్థిరత యేమాత్రమున్ను కలుగకున్నది. అదెట్లనగా– భేరీనాదమువలన భయానకరసమున్ను, శంఖనా దమువలన బీభత్సరసమున్ను, వీణానాదమువలన శృంగార రసమున్ను కలుగుచున్నవి. గాన యీమూడు శబ్దములు, త్రిగుణాత్మికములై యైనందున, త్రిగుణాతీతస్థితి కలుగువరకు మనోనిశ్చలత కుదరదు. అట్టి మనోనిశ్చలత్వమునకు, వైరా గ్యరసము, వివేకరసము, విజ్ఞానరసము కావలయును. తాప శాంతి గోరువాడు, శీతలప్రదేశము శీతలజలము శీతలవా

యువు కోరునట్లు, సంసారతాప శాంతిని కోరువారు ముందు చెప్పిన మహావాక్యార్థము నే ఆశ్రయించవలెను. ఎందువల్ల ననగా, నేత్రాదింద్రియములు ప్రత్యక్షప్రమాణము లగుట వలన, ఒకప్పుడు విపరీతార్థముల నే కలిగించి, గొప్పహానిచే యును. మహావాక్యార్థ మట్లుగాక, ఎల్లప్పుడు ఒకేఅర్థమును చెప్పి, ఇహపరములలో మేలు నే చేకూర్చును. విపరీతమును ఎన్నటికీ పుట్టింపదు. కాబట్టి యిటువంటి మహావాక్యార్థము యొక్క పవిత్రత, (శ్రీ) శుకరహస్యోప నిషత్తునందును, పైంగలోపనిషత్తునందును విశేషముగా చెప్పబడియున్నది. తది తర ఉపనిషత్తులందుకూడా చాలాభాగమువరకూ యున్నది. అయినప్పటికిన్నీ ఆయాభాగములన్నీ యిచ్చట తెలుపుటకు గ్రంథవిస్తర మగునని, ఆయాభాగములలో ముఖ్యవిషయ ములు కొన్నిటినిమాత్రము, ఇందు చేర్చడమైనది. యిందు వ్రాసిన సంగతులు గ్రహించి కంఠస్థముచేసిననూ ధన్యు లగుదురు.

శ్లో॥ తత్త్వమసీత్యభేదవాచకమిదం యేజపంతి।
తేశివసాయుజ్యముక్తిభాజోభవంతి॥

తా॥ యను శుకరహస్యోపనిషద్వాక్యరీతిగా తత్త్వమ స్యాది మహావాక్యములను అభేదబుద్ధితో ఎవరు జపింతురో, వారు శాశ్వతమగు కైవల్యముక్తి నొందగలరు. తరువాత

ఉపనిషత్తులయందు శిష్యుడు శ్రీ గురువునుగూర్చి యిట్లు ప్రశ్నించుచున్నాడు. హేభగవన్! స్వప్నద్రష్టకువలె జగత్తు మిధ్యయని చెప్పితిరిగదా! మధ్యాహ్నం పన్నెండుగంటలవేళ సూర్యునివెలుగులో చీకటి కానుపించనట్లు స్వయంజ్యోతిరూపాత్మయందు మాయ ఎట్లు స్థితమైయున్నది అనిన శ్రీ సద్గురువులవారిట్లు చెప్పుచున్నారు- హే శిష్య! ఈమాయ అత్యంత దుర్ఘటమై సంసారసూలమునకు జననియైయున్నది. కావున యీమాయ తన స్వభావబలముచేతనే స్వయంజ్యోతిరూపాత్మయందు స్థితి కలిగియున్నది.

ఆకారణముచే శాస్త్రవేత్తలగువారు ఈమాయను అఘటిత ఘటనాపటీయసీయని కథనము చేసియున్నారు. కావున వృశ్చికి తన గర్భముచే స్వయముగా మరణించునట్లు యీమాయావృశ్చికియు ఆనందాత్మను కథనముచేయునట్టి మహావాక్యజన్య అంతఃకరణావృత్తి జ్ఞాన రూప గర్భముచే నశించిపోవుచున్నది. కాని యీ మాయావృశ్చికి స్వయం జ్యోతిరూపాత్మ ప్రతిబింబమున కెన్నటికినీ భయపడకున్ననూ వేదాంతమహావాక్యమువలన జనించినదైన శుద్ధాంతఃకరణ వృత్తి ఆనందాత్మ ప్రతిబింబమునకు సర్వదా భయపడుచునే యుండును.

అనగా వృక్షమునందు అగ్నియున్ననూ, ఆవృక్షమును కాల్చుటలేదు సరిగదా! ఆవృక్షము పత్రపుష్ప ఫలాదులతో వృద్ధినొందుచునే యున్నది. కాని చెట్టు చెట్టు రాపి

డిచే అథవ అరణిచే మథనముచేసినచో చెట్టులోనుండి అగ్ని బయటకువచ్చి రెండు కట్టెలను కాల్చుచున్నది. అదే విధముగా తన హృదయమందు జ్ఞానాగ్నియున్ననూ, జన్మ కర్మలు నసించుటలేదు. గాని గురుశాస్త్రాదులచే విచార రూపవిజ్ఞానాగ్ని శుద్ధాంతఃకరణముచే వెలువడినచో అప్పుడే కర్మ కట్టెలన్నిటిని కాల్చివేసి జన్మరాహిత్యము చేయును.

సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ। యేకమేవా ద్వితీయం బ్రహ్మ। సర్వంఖల్విదంబ్రహ్మ। నేహనానా స్తికించనా। ప్రజ్ఞానంబ్రహ్మ। అహంబ్రహ్మాస్మి। తత్వమసి। అయమాత్మాబ్రహ్మ।

ఈ ఎనిమిది మహావాక్యములు, త్రికాలములయందు పఠించవలెను. పుణ్యములేదు, పాపములేదు. జన్మములేదు, జగత్తులేదు, షడూర్మిరహితము శివం.

పరా యనగా ప్రకృతి, ప్రకృతియనగా మాయ, మాయఅనగా ఏమీలేనిది, కనిపించే ప్రపంచకము సత్యమనే భ్రమ. అంతరబాహ్యములు అవాగ్మానసగోచరము "యద్దృశ్యం యత్ కృతం దదనృతం" సదా అనిత్యమనే న్యాయమునుబట్టి వాక్కున చెప్పబడే సర్వమున్నూ అనాత్మయనే, అజ్ఞానమును విడచి ఒక గురుదీక్షయందు నిలచియున్నదే ఆత్మయనిన్నీ, జ్ఞానమనిన్నీ, ఆత్మానాత్మల రెంటినీ తెలసుకొన్న తానే బ్రహ్మమని ఋగ్వేద మహావాక్యము.

అహంబ్రహ్మాస్మి యనగా–అహం అనగా నేనన్నమాట. నేననగా అకార వుకార మకారములు, యీమూడు

కూడిన దే ప్రణవము, ప్రమాణము. అకారం బ్రహ్మ రజో గుణము. అది శబ్దరూపముగా యుండును. ఉకారం విష్ణువు సత్వగుణము. అది సంకల్పరూపముగా యుండును. మకారము రుద్రుడు తమోగుణము అది వాక్యరూపముగా యుండును. చూపు పలుకు మనస్సు సద్గురువు చెప్పిన స్థానమున, అంతము చేయడమే ప్రణవమని ప్రమాణము. అకారమనే అర్ధమాత్రృక ఆధారచక్రమందు పుట్టి, పరా పశ్యంతి మధ్యమ వైకరీయని చతుర్విధ శబ్ధములను దాటి, అహం అనే సుషుమ్న ఎక్కి, ఆ స్థానమందు అయిక్యమగును. కనుక అహం బ్రహ్మాస్మి యని పలుకును. అహం యనగా నే నన్నమాట. నే ననగా, అచలమైనటువంటి పరబ్రహ్మమనిన్నీ, అదే చూపుఅయిన దనిన్నీ, విశ్వమంతా భరించినందువల్ల యీశ్వరనామము ధరించినందువల్ల మంగళప్రదమైనటువంటి తెలివి నిచ్చుటచేత శివుడనిన్నీ, ఆ తెలివి చక్షుర్మధ్యమందు వున్నదని-

శృ॥ విశ్వంచక్షురీతం తస్మిన్ సర్వప్రతిష్టితమ్ ॥

ఆయొక్క చక్షుర్మద్యమందున్న సర్వచరాచరప్రపంచకము గురువుచెప్పిన దీక్షయందు నిలుకడవహించిన దే యజుర్వేదార్ధము. యీ అర్ధము అభ్యాసమైతే అహంబ్రహ్మాస్మియని పలుకును. తత్వమసి యిచ్చును. ఈ వేదవాక్యము జపంతి. ఇది శివసాయుజ్యముక్తి, గురువుయందు క్రియాద్వైతము, ఆత్మయందు భావాద్వైతము, ప్రపంచమందు ద్రవ్యా

ద్వైతము, యీమూడు కలిగినదే అభేదవాక్యము. ఇది జపం చేయతగ్గది భగవద్వాక్యము.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్రజా ।
. అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచ॥

సర్వధర్మములు అనగా ధర్మాధర్మములకు మూలమైన తెలివిని (పరిత్యజ్య) విడువుము. తెలివిలేకపోతే యేమిలేకపోతుందని విచారపడవద్దు. నీ తెలివి నాయందైక్యము చేయుము. నామరూపరహితమై కంటికికనుపించక చేతికిదొరకకా, రమ్మంటేరాకా, పొమ్మంటేపోక, వుండమంటేవుండకా అంతటా స్వతసిద్ధముగాయుండీ అంతా తానైయుండి, ఏది తాను అంటీఅంటక స్వజాతీయ విజాతీయ, స్వగతభేదరహితమైనటువంటిది యేదో అట్టి తెలివిని నాయందు అయిక్యపరచడమే శరణంవ్రజా।

"అహంత్వా సర్వపాపేభ్యో" అనగా నాది నేను నా కులము, నా స్థలము, అన్నమాట నసించినందున మోక్షమే కలుగును. తత్వమసి తత్ యనగా నిరాకారస్వరూపము త్వం అనగా హంసస్వరూపము. అసియనగా అనిరాకారమందున తిరిగి కలయుట, యీప్రకారం అయిక్యమౌతున్నట్లు తెలుసుకొని భ్రమవిడువుమా, జీవేశ్వరులవ్యష్టి, సమిష్టి యనగా, జీవుడనగా ప్రపంచం సత్యమనే భ్రమయే. ఈశ్వరుడనగా, సర్వప్రపంచమూ అనాత్మగా యెంచి ఏకత్వసిద్ధి కలగడమే ఈశ్వరత్వము. కనుక సర్వప్రపంచక జ్ఞానము,

కలుగడమే. అభేదజ్ఞానమని సమస్తమైన వేదాంతములు చెప్పుచున్నవి. జీవేశ్వరులకు అయిక్యసంధాన మనగా-శాస్త్రమందున చెప్పుటగాన అయిక్యము పరిణమించును. ఇదే సామవేద మహావాక్యము.

ఈవాక్యము ఒక అండమందు తాత్పర్యము. అండ మనగా-గుడ్డు, పిండ మనగా సమస్తదేహములకూ, కారణమైనందువల్ల, హంసస్వరూపము. బ్రహ్మ మనగా-పదునాలుగు భువనములు తనకుక్షి తామరలో ఇముడ్చుకొని తాను విలక్షణమైనందువల్ల, పరమాత్మ ఇన్నిటికీ యేకత్వసిద్ధికలిగినదే. అండాండం-అండాండంలోనిదే పిండాండం. బ్రహ్మాండము-పిండాండములోనిది బ్రహ్మాండమువల్లనే, అనంతకోటి బ్రహ్మాండములు, యీసమస్తభువనములు అండాండంలోనివి. పిండాండం బ్రహ్మాండములోనిది. యీనాలుగు మహావాక్యముల అర్థము తెలుసుకొన్నవారే, పాప పుణ్య జననమరణములులేని, బ్రహ్మస్వరూపులు. యిదే గురువాక్యము. యిది నమ్మినవారికి, మోక్షముతప్పదు. ఇదే అధర్వణవేద మహావాక్యము. గురువాక్యము నమ్మివుండవలెను.

"శ్రీసద్గురు పరబ్రహ్మార్పణమస్తు"

శాంతి శాంతి శాంతిః

ఇట్లు
చరాచరసుఖాభిలాషి,
గౌడు జోగమాంబ.